# సంగమ్మ



గుడిపాటి వెంకటచలం.

## మా ప్రథమ ప్రచురణము

# ❖ చ లం గా రి క లం ❖

### పత్రికాభిప్రాయాలు.

చలంగారు జగమెరిగిన బ్రాహ్మణుడు. ఆయన రచనల్ని ఆశయాల్ని గురించి చర్చించడం చర్విత చర్వణమే అవుతుంది.

ఈ కథాసంపుటిలో 10 కథలు వున్నాయి. కొన్నిదివరలో పత్రికలలో పడినవి. కొన్ని కొత్తవి.

బందరు, అభిసారికా గ్రంథమాల శ్రీ చలం గ్రంథాలను వరుసగా ప్రకటింపబూనటంవల్ల వీరికథలు......మరికొన్ని పాఠకలోకానికి అందే అవకాశం చిక్కింది.

చలంగారిలో వస్తుతఃగల భావపరిశీలన, ప్రకృతిపరిశోధన, భాషా చాతుర్యం ఈ కథలలోనూ వున్నవి.

'చలం గుండెలుతీసిన బంటు' అని చెప్పుకోతగ్గ ఘట్టాలు కొన్ని ఈ కథలలో కనుపిస్తవి.

కథలు చదివి చలంగారిని తిట్టేవారికి దీవించేవారికికూడా ఒక కొత్త అవకాశ మిస్తుందీ పుస్తకం.

(కృష్ణా)

వెంకటచలంగారి కథలంటే, పడతిట్టేవాళ్లూ పని పెట్టుకుని లొట్టలు
వేసుకుంటూ చదివేవాళ్లూ ఉన్నారు. మధ్యరకంవారున్నారు. వీరనే దేమి
టంటే-చలం కథకులలో గొప్పవాడే. సందేహంలేదు మంచి నూటిదనం,
హుందా, టెక్నిక్, వాడియైనభాషా అన్నీ వుంటై. కాని ఇతివృత్తంఅంతా
...అంటారు. మరికొందరు ప్రపంచంలో కుళ్లులేదనం, కాని ఆకుళ్లును వెళ్ల
బోసి సాధించే దేమిటి? ప్రపంచ-మరామత్తుకు ఇది దారికాదు. సైకైట్రిక్ గా
అక్కడక్కడ దెబ్బతిగిలినా, చదువరిమనస్సు ఉబలాటపడుతుంది గాని
అసహ్యపడదు.......ఈ రోజుల్లో; స్వార్థపరత్వం, కౌటిల్యం, . స్పర్థలు,
ఈర్ష్యలు, దౌర్బల్యాలు, నైర్మల్యాలవల్ల యీ యీ వ్యధలు కలుగు
తున్నాయని చాటడానికే శ్రీ గుడిపాటి వెంకటచలం కథముడై కూచ్చుంది.
ఈ ఈ పరిస్థితుల్లో, యీ యీ
... ... ... ...

వ్రాసింది

శ్రీ గుడిపాటి వెంకటచలంగారు, బి. ఏ., యల్. టి.

# 'మంగమ్మ'

ప్రచురించింది

అభిసారికా గ్రంథమాల, మచిలీపట్నం.

వెయ్యి: ప్రథమ ముద్రణ

ప్రతి: ఆరు అణాలు

వచ్చేది



చలంగారి

# స్త్రీ



స్త్రీకికూడా శరీరంవుంది, దానికి వ్యాయామము యివ్వాలి; ఆమెకి హృదయం వుంది, దానికి అనుభవం యివ్వాలి; అనేసంగతి గుర్తించని యీ దేశానికి, నేను వ్రాసే యీ సంగతులు అర్థమవుతాయా? పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో పడి, వొళ్లు తెలీక, నోటికి వొచ్చినట్లు వాగిన కూతలనుకుంటారని తెలుసు. కాని యిట్లాంటి పుస్తకం, నా చిన్నతనంలో నాకు దొరికితే, నా జీవితాన్ని యిప్పటికన్న యెన్నోరెట్లు పవిత్ర వంతమూ, సార్థకమూ చేసుకోగలిగేవాణ్ణి. నావంటివారు యీ నూతన యుగములో వున్నారేమో!

(గ్రంథకర్త.)



ముద్రించింది
మినర్వా ప్రెస్, మచిలీపట్నం.

## ♦ ఇందులో ♦

మంగమ్మ: కథానాయకి

నారాయణ: మంగమ్మ రహస్యంగా కన్న కొడుకు

వెంకటచలం: మంగమ్మ పెంపుడు కొడుకు

విమల: వెంకటచలం పాతభార్య

నీరద: వెంకటచలం కూతురు

వసంతం: వెంకటచలం కొడుకు

సుందరేశయ్యా: మంగమ్మ కొత్త వియ్యంకుడు

కామాక్షి: వెంకటచలం కొత్తభార్య

లక్షి: తోటమాలి కూతురు

## చలంగారి

కథలు

నవలలు

నాటకాలు

వ్యాసాలు

ప్రేమలేఖలు

Musings

మేము ప్రచురిస్తాము.

అన్నిచోట్లా ఏజంట్లు కావాలి.

వివరాలకు వ్రాయండి.

(ప్రకాశకులు)

# మంగమ్మ

1

(సాయంత్రం నాలుగ్గంటలు - మంగమ్మగారి యింటిపక్కన మామిడి తోటలో నీరదా, వసంతం నుంచుని వున్నారు. ఇద్దరి జడలూ ఒకదాని కొకటి ముడేశారు. చేతులు వెనక్కి కట్టేశారు. బిక్కమొహాలు - నీరదకి యెనిమిదేళ్లూ, వసంతానికి యేడేళ్లూ.)

నీ॥ అంతేకావాలి బాగా యేడు. నాజుట్టు కోస్తానంటావా?

వ॥ కోస్తా, యింకాబాగా కోస్తా...నొప్పి, నొప్పి అట్లాలాగకు.

నీ॥ వుండు, వసంత్, కొంచంవుండు. కాలుమీద చీమపాకుతోంది—

చూడనీ, లాగకు. పెద్దచీమ- అమ్మో, కుట్టడానికి ముక్కుతీస్తోంది. ఎట్లా తీసెయ్యను? వసంత్, నువ్వుతియ్యవూ?

వ॥ యెట్లా?

నీ॥ అవును, యేంచేద్దాం? యెవరూ రారేం?

వ॥ యెందుకువొస్తారూ? వాళ్ళకేం...అక్కా యిట్లాగే నడుస్తో వెళ్ళిపోదాం, వీళ్ళకి కనపడకండా!

నీ॥ యెక్కడికి?

వ॥ యెక్కడికన్నా సరే. ఈ పంజరంలోంచి యెగిరిపోదాం.

నీ॥ పంజరంలోంచా! అమ్మమాటలు మాట్లాడుతున్నావు.

వ॥ అమ్మ యేడవడం, నాన్న మళ్ళీ పెళ్ళిచేసుకున్నందుకేగా!

నీ॥ అమ్మమ్మే పెళ్ళిచేసింది......... నాచేతులు నొప్పిపుడుతున్నాయి.

(విమల వొచ్చింది. యిరనై మూడేళ్లు)

అమ్మ అదుగో! అమ్మా! అమ్మా! .........కొంచం వొదులుచెయ్యి అమ్మా, నొప్పిపుడుతోంది. (విమల తాళ్లు విప్పుతోంది.)

వి॥ మళ్ళీ కట్టిందా, ఎందుకు?

నీ॥ పిల్లిని యేడిపించామని.

వి॥ దానికి పిల్లలకన్నా పిల్లి యెక్కువ!

వ॥ పిల్లి పీకిందమ్మా!

వి॥ అయ్యో, యెంతెంత గాట్లుపడ్డాయో! ఆ గొడ్రాలు ముండ నా పిల్లల్ని యిట్లా యాతన పెడుతోవుంటే నోరెత్తేగతి లేదు నాకు!

వ॥ చూడమ్మా, యెంత యెర్రపడ్డదో!

వి॥ అవును. బాబూ!

వ॥ అందుకని నాకు రెండు లడ్డెక్కువ యియ్యాలి.

నీ॥ నాక్కూడా ఇయ్యాలి...చూడు అమ్మా......అంతా వ్రాడింది. మళ్ళీకట్లు వొదులుగా!......అమ్మా యెందుకు ఏడుస్తావు?

వ॥ కట్టించుకోను. అక్కా.

నీ॥ అమ్మని కోప్పడుతుంది అమ్మమ్మ.

(విమల మళ్లీ కడుతోంది).

నీ॥ అమ్మా యెందుకు ఏడుస్తావట్లా?

వి॥ నేను......చచ్చిపోతే మీరేడుస్తారా ?
నీ॥ ఎందుకు చచ్చిపోతావు ?
వి॥ చచ్చిపోతే ఏడుస్తారా ?
నీ॥ యెందుకు చచ్చిపోవడం ? నువ్వు చచ్చిపోతే మాకు అన్నం యెవరు పెడతారు ?
వి॥ మీకొత్త అమ్మలేదూమరి ?
వ॥ నీరదా, నీకు అమ్మవుండదు.
వి॥ నీకూ ?
వ॥ వుంటుంది. ఎందుకంటే, యిద్దరుమూ పంచుకున్నాం. నువ్వే నీరదకీ, కొత్త అమ్మ నాకూ......కొత్తఅమ్మతో చెప్పు మాకు సరిగా అన్నం పెట్టమని. అక్కకిలేకండా పెరుగంతా నాకే వెయ్యమను.
వి॥ నేను లేకపోతే మీకు చాలా దిగులేస్తుందికదూ ?
నీ॥ మరికథలుకూడా చెపుతుందా ! కొత్తఅమ్మ !
వి॥ చెపుతుంది.
వ॥ సరేలె. అమ్మా ఐతే యేడవంలే !
వి॥ నేనింక ఎప్పుడూ కనపడను.
వ॥ మేము పెద్దవాళ్లమైనాక కూడా ?
నీ॥ మనంకూడా చచ్చిపోయినాక కనపడుతుంది.
వ॥ గోతులోనా ?
వి॥ మీమీద యెవరికి నిజమైన ప్రేమవుంటుంది. మీకు కావలసిన వొస్తువులన్నీ మీకెవరు—
వ॥ అమ్మమ్మవుందిగా ! యాడవక అమ్మా ! మేము హాయిగానే వుంటాము.

సీ॥ దేవు డెప్పుడన్నా వొదిలితే, వొచ్చిచూడు మమ్మల్ని. బొమ్మలూ, అవీ, పట్టుకురా!

వి॥ యీ కొత్త అమ్మ నిజంగా మిమ్మల్ని ప్రేమిస్తుందనా?

సీ॥ ఆ. మాతో ఒకటే ఆడుకుంటుంది.

వి॥ అమ్మమ్మ కొడితే నన్ను తలుచుకుని యేడుస్తారా?

సీ॥ అమ్మమ్మ మామంచికోసమే, మమ్మన్ని మంచివాళ్ళని చెయ్యాలనే కొడుతుంది.

వ॥ అమ్మమ్మ కొడితేనేం! మంచిబట్టలు కొనిస్తుంది. నాకు పెళ్ళిచేస్తుందిట! మోటారులో యెక్కి ఒకటే వూరేగడం అప్పుడు. రెండుసార్లు పెళ్ళిచేసుకుంటా నాన్నమల్లే! నాకు కలెక్టరుపని యిప్పిస్తుందిట!

వి॥ మీ అమ్మ యేదంటే, యేమంటావు?

వ॥ చచ్చిపోయిందంటాను.

(విమల యివతలికివొచ్చి నిట్టూర్పువిడిచి నెడుతోంది.)

సీ॥ అమ్మ యెప్పుడూ యెందుకో అసయ్యంగా ఏడుస్తోవుంటుంది!

వ॥ అమ్మ చెడ్డది. అమ్మమ్మ చెప్పలా?

సీ॥ మన్నికూడా చెడకొట్టుతుందిట.

వ॥ యింకెంతసేపటికీ ఎవరూ రారేం?

సీ॥ ఆ పంజరంలో కూచుంటారు.

వ॥ యీసారి అల్లరిచేశానని వొప్పుకోవద్దు, అక్కా. వొప్పుకుంటే, యేంచెయ్యనని, మళ్ళీకట్టేశిందయ్యా అమ్మమ్మ. తనుహాయిగా అబద్ధాలు చెప్పుకోవచ్చు. యేం? నోరు తెరిస్తే యింతలో, తన పిల్లి అరిగిపోయిందా? పూరికే తిని పడుకుని యేం చేస్తుంది?

నీ॥ ఎవరు, అమ్మమ్మా, పిల్లా?

(కామాక్షి వొచ్చింది. పద్దెనిమిదేళ్లు - పెళ్లికూతురు ముస్తాబు.)

వ॥ అదిగో, పంజరంలోపడ్డ కొత్తపిట్ట.

నీ॥ అమ్మ అందికదూ, అట్లా?

వ॥ కొత్తపెళ్ళికూతురోయ్!

కా॥ యింకెప్పుడూ పిల్లిని యేడిపించనని అంటే వొదిలెయ్యమంది అమ్మమ్మగారు.

వ॥ కనపడ్డ పిల్లుల నన్నిటినీ చంపుతాను.

నీ॥ పిన్నీ, లడ్లు తయారైనాయా?

వ॥ పిన్నీ, అమ్మ చచ్చిపోతే, రాత్రి నన్ను నీదగ్గిర పడుకోపెట్టు కుంటావా?

కా॥ అమ్మ చచ్చిపోవడమేమిటె?

(నారాయణ వొచ్చాడు. యిరవై రెండేళ్లు. షోకుగా బట్టలు వేసుకున్నాడు. అతన్ని చూసి కామాక్షి వెళ్లిపో బోతోంది).

నీ॥ పిన్నీ వెళ్ళకు నారాయణ నన్ను కొడతాడేమో?

వ॥ నన్ను తప్పకండా కొడతాడు, కందువా చింపానని.

నా॥ ఓరి దొంగవెధవా, నువ్వేరా చింపింది?

వ॥ అమ్మమ్మ మమ్మన్ని తిట్టడానికి పీల్లేదనలేదూ, నిన్ను?

నా॥ తిడతానా_ కొడతానా_ చంపుతానా?

(కొట్టబోతున్నాడు).

వ॥ పిన్నీ, పిన్నీ

(కామాక్షి అడ్డంవెళ్లింది)

కా॥ కందువా చింపితే మంగమ్మగారితో చెప్పండి.

నా॥ ఏందయ్, పిల్లలంటే, అప్పుడే!
కా॥ ఎందుకు చింపావమ్మా?
వ॥ వీడు నన్ను కొట్టాడు.
నా॥ మళ్లీ, 'వీడు' అంటున్నావూ?
(చెవిపట్టుకోబోయినాడు. వసంతం కామాక్షి వెనక్కి వెళ్ళాడు).
మీ అబ్బతో చెప్పుకో.
కా॥ ఏమిటి అది అట్లా మాట్లాడుతావు?
నా॥ అబ్బో, యెంత అభిమానం అప్పుడే! యింకా ముడిపడ్డదో లేదో, వాడిమీద అభిమానమేమిటి? ఆ పందికొక్కుగాడిద మీద! యింత షోకుగావున్నావు! యీ పిల్లలతోనేంగాని, రా. అట్లా షికారు తిరుగుదాం. పెళ్ళి ముడిపడ్డదిగా, యింకేంచేసినా స్వేచ్ఛే.
కా॥ ఛీ, పో, మళ్ళీ మంగమ్మగారితో—
నా॥ టక్కులుచెయ్యకుమరి! మంగమ్మగారు నన్నేంచేస్తుంది? అయినా వుత్తబెదిరింపులేకాని నువ్వెందుకు చెపుతావు? నేనెరగనూ యీ అరవజట్టుని.
వ॥ పిన్నీ, నాచేతులు పీక్కుపోతున్నాయి. పిన్నీ—
కా॥ (కన్నీళ్లతో) నాతో మాట్లాడమన్నానా నిన్ను. నేను నీతో వొక్కమాట మాట్లాడానా? వూరికే వొచ్చినప్పణ్ణించీ నన్నిట్టా యేడిపిస్తున్నావు, పుండాకోర్! నీకు శాస్తి చేసే మొగాడు లేకపోబట్టేకదూ? యీవాళ మా నాన్నగారు వొస్తున్నారు వుండు.
నా॥ రానీ, నాలుగు తన్నులు తంతాను.
కా॥ తంతే వూరుకుంటారు?

నా॥ ఐనా నువ్వుచాలవ్వా, నలుగురు మొగాళ్లకి......యేడు
స్తోందోయ్, తుడవనా ?

నీ॥ వెధవ, పిన్నిని ఏడిపిస్తున్నాడు.

నా॥ అయ్యో. మనబతుక్కితోడు మనం యింకోళ్లని దెప్ప
డంకూడాను! దిక్కులేకేకాదూ, యీ రెండోపెళ్ళికి
కక్కుర్తిపడ్డది! డబ్బుకోసమేగా ? నాదగ్గిర దాస్తావు!

నీ॥ పశువుగాడు.

వ॥ వీణ్ణి చంపితే—

నా॥ చంపుదురుగాని.

వ॥ నేను పెద్దవాణ్ణికానీ!

నా॥ ప్రస్తుతం నేను నిన్ను చంపుతా.

నీ॥ నాన్న వీణ్ణి చంపకూడదూ ?

నా॥ (కామాక్షి బుగ్గపట్టుకుంటో) చంపమను.

(తటాలున కామాక్షి అతని చంప పగలకొట్టింది).

నా॥ (రుద్దుకుంటో) అబ్బా యెంతదెబ్బకొట్టావు! యేదీ ఆ
కోపం మొహం! నీవంటిదానికోసమే చూస్తున్నా నిన్నాళ్ళు
యింక సిన్ను వొదలను.

కా॥ పో వెధవా!

నీ॥ బాగా కొట్టావు, పిన్నీ.

వ॥ ఆడవాళ్లని యేడిపించడం వొక్కటి చాతనవును.

నా॥ పిల్లల్ని గిల్లడంకూడా చాతనవును.

(వసంతుని తొడపాశం పెడుతున్నాడు. వసంతం అరుస్తున్నాడు.
మంగమ్మ వొచ్చింది. ఆమెకి దాదాపు యాభై యేళ్లు. ఆజానుబాహువు).

మం॥ యేమిటది? యెందుకు వసంతుని గిల్లుతున్నావు నువ్వు? కామాక్షీ! ఆకాటికంతా కరిగిపోతో నువ్వెందుకు ఏడుస్తున్నావు?

వ॥ నారాయణ గిల్లాడు.

మం॥ (కామాక్షితో.) నువ్వెందు కేడుస్తున్నావు? మళ్ళీ నిన్నేమన్నా అన్నాడా?

కా॥ పిల్లలేడిస్తే నాకూ ఏడుపొచ్చింది.

మం॥ (కామాక్షి చెంపల్ని అదిమి) యేం హృదయమమ్మా!

వ॥ అమ్మమ్మా, మమ్మన్ని యెప్పుడూ కొడతాడు. వాణ్ణేమీ అనవు.

మం॥ వాడేమిటి? వాడు!

సీ॥ నారాయణ పిన్నిని యేడిపించాడు.

మం॥ (కామాక్షితో) దాస్తావేం?

వ॥ నన్నుకొట్టాడు అమ్మమ్మా. ఆ సంగతి అడగవేం?

మం॥ యెన్నిసార్లు చెప్పాలినీకు, పిల్లల్ని కొట్టవొద్దని. యీసారి చెయ్యి చేసుకున్నావా, సరిగా జరగదు.

నా॥ పోనీండి.

వ॥ వెళ్ళగొట్టు అమ్మమ్మా! నువ్వెంతచెప్పినా మళ్ళీ కొడుతోనే వుంటాడు. మా ముందు కోప్పడుతావు. మళ్ళీ రహస్యంగా బతిమాలుకుని, సైకిలూ, అదీ కొనిస్తావు.

(మంగమ్మ ఆశ్చర్యంగా చూస్తోంది)

నా॥ చూశారా వాగుడు.

మం॥ ఒకే, వసంత్ నేను నీకుమాత్రం. యేం తక్కువచేశారా? మరి నారాయణ మాత్రం మీవంటివాడుకాడూ?

వ॥ కాదు, నౌకరు.

నా॥ చూశారా? చూశారా?

మం॥ చిన్నపిల్లవాడు వాడితో నేం లే! కాని నువ్వు కొట్టడానికి మాత్రం వీల్లేదు.

నా॥ పోనీ నేను వుండడం అంత కష్టంగావుంటే నేను పోతాలెండి నా కండువాచింపటం బాగానేవుందీ? (వెడుతున్నాడు.)

మం॥ నారాయణా మాట (నారాయణ రాలేదు). ఏం చెయ్యను, కామాక్షీ, యెంతచెప్పినా వాడికి బుద్ధిలేదు. ఎంత బెదిరించినా భయంలేదు. కాని మళ్లీ చెపుతున్నాను. వాడు చాలా తుంటరి. టక్కులమారివాడు. నాప్రాణాలు కొరుక్కుతింటున్నాడు: చావనన్నా చావడు. రాగానే చెప్పాను. నీతో మళ్ళీ చెపుతున్నాను. వాడినించి దూరానవుండు. వీడి మాటలు వినే విమల చెడిపోయింది.

కా॥ అసలునాకు వాణ్ణిచూస్తే వొళ్లుమంట. కన్నెత్తిచూస్తానా ఆ వెధవని? నీచుడు, యే పాపిష్టిదానికి పుట్టాడోగాని—

మం॥ అదుగో? తిట్టకు. యెవరు కంటే మనకెందుకు?

కా॥ యెటువంటిదుర్మార్గురాలుకనకపోతే, యీపాడుబుద్ధులు —

మం॥ వూరుకోమనలేదూ! యింతకీ యివన్నీ తల్లిబుద్ధులా? తండ్రివే ఐవుంటాయి. ఆ పరమపాతకి వీడిమల్లేనే, ఆ తల్లిని వంచనచేసి వుంటాడు.

కా॥ వీడు అతి నీచుడు. తుంటరి—

మం॥ ఆడవాళ్ళవిషయంలో అట్లా అన్నానేగాని, తక్కువ విషయాల్లో వీడు చాలా పెద్దమనిషి. స్త్రీవి గనక వాణ్ణించి దూరంగా వుండు. వాడి మాటలు నమ్మకు. అంతేగాని

వాణ్ణేమీ అనకు. వీడిమల్లే వ్యవహారం చెయ్యగలవా డున్నాడా? సమయం వొస్తే ప్రాణమిస్తాడు. యెందుకు మీ ఆయన అందానికిగాని, తెలివికిగాని, దర్జాకిగాని వీడికి దిగతుడుపే కాదూ?

కా॥ వూరికే పైకి పోకుగా వుంటేసరా? శూద్రబుద్ధి! వాడు —

మం॥ వూరుకోయింక- నేను 'వాడు' అంటే నువ్వూ అంటావా?

కా॥ యామునాలి 'దొరగారు' అనాలా ఆచాకలాణ్ణి.

మం॥ యేం చెప్పాను.

కా॥ కాని నా వెంటబడి తిప్పలు పెడుతున్నాడు. మీతో చెప్పినా వూరుకున్నాడా? వాడికి భయమూ, భక్తీ లేదు. నేను వూరుకునే మనిషిని కాను.

మం॥ నేను చెపుతాలే, నువ్వు వూరుకో.

వ॥ అమ్మమ్మా యింకా యెంతసేపు?

మం॥ వుండు. (కామాక్షితో) నువ్వు ఆడదానివి. అది నీ జీవితంలో ప్రతి నిముషమూ జ్ఞాపకముంచుకో.

నీ॥ అమ్మమ్మా, అమ్మచచ్చిపోతుందిట?

మం॥ వుండు. పెద్దవాళ్లు మాట్లాడుతోవుంటే, అడ్డం రాకూడదని యెన్నిసార్లు చెప్పాలి? యిదుగో కామాక్షీ ఆడదానికి గొప్పభూషణమేమిటి?

నీ॥ రవ్వల అడ్డిగ.

మం॥ అదికాదు. గుణాల్లో?

కా॥ తెలివి.

మం॥ తెలివి? యెందుకు తెలివి? పుణ్యమా, పురుషార్థమా? శీలం, అడకువ, శాంతం, పాతివ్రత్యం—యివీ.

వ॥ హాయిగా మీరు తేలిగ్గాకూచుని మాట్లాడుకుంటున్నారు. మేంచస్తున్నాం. యేమిటో భూషణంట. శాంతంట.

కా॥ పాపం, వాళ్లని వొదులుదాం.

మం॥ విను ముందు.

కా॥ పాపం, చేతులు నొప్పిపుడుతున్నాయి.

మం॥ మాటకి అడ్డం రావడం తప్పని ఒక్కసారే నేర్చుకో.

కా॥ అవును. యింక యెప్పుడూ అడ్డంరాను. వీళ్ళని వొదిలేద్దాం.

మం॥ సరేలే విప్పు. ముందు వీళ్ళపనిచూద్దాం (కామాక్షి విప్పుతోంది). కాని మాటిమాటికీ నన్నిట్లా అడగవొద్దు నువ్వు. పుట్టిననాటినించి వీళ్లని కడుపులో పెట్టుకుని పెంచుకుంటున్నాను. ఆ తల్లివల్ల చెడిపోకండా, దాని బుద్ధులు తలెత్తుతోవుంటే, జాగ్రత్తగా వాటిని నిర్మూలంచేస్తో, వాళ్ల తాతగారి ప్రతిష్ట మళ్లీ నిలబెట్టేవాళ్ళుగా తయారు జేస్తున్నాను. తెలిసిందా? యీ నాలుగు రోజుల్నించి చూస్తోనేవున్నావుగా?

కుర్రాళ్లా! నాయెదురుగా నుంచుని నేను చెప్పేమాటలు శ్రద్ధగా వినండి. చేతులిట్లా కట్టుకోండి. వొరే, వసంతం, యిట్లాచూడు. మీరు మధ్యాన్నంచేసిన తప్పు విషయం తెలుసుకున్నారా? పిల్లి యెటువంటి మృగము?

నీ॥ క్రూరమృగం.

మం॥ కాదు. నోరులేని సాధుమృగము.

వ॥ నోరువుంది దానికి.

నీ॥ కాదు. మా వాచకంలో క్రూరమృగమనివుంది.

మం॥ కాదు. పిల్లి మనకేమన్నా హానిచేస్తుందా ?

వ॥ పీకుతుంది.

మం॥ వూరికే పీకుతుందా?...వినండి లోకంలోని సమస్త జంతువులకూ, ప్రియతమమైనది ప్రాణము. అటువంటి ప్రాణాన్ని కాపాడడమే మనకు పరమధర్మము. అధికమైన పుణ్యము. సర్వధర్మాలూ దానిలో యిమిడివున్నాయి. సమస్త పురాణాలూ, శాస్త్రాలూ, వేదాలూ, దాన్నేబోధిస్తున్నాయి. మనదేశంవుండే, భూతదయకే ప్రసిద్ధికెక్కింది. మాకున్న మూలరుద్రారవారు "అహింసాపరమోధర్మః" అన్నారు. ఒరే! వసంతం, యెక్కడచూస్తున్నావు.

వ॥ ఆ కాకికి ఆ రెక్క అట్లా వేళ్లాడుతోంది. పాపం, యెగరలేదు.

మం॥ పోనీలే, దానిఖర్మం దానిది. యిట్లాచూడు మానవుడి విధి సమస్త ప్రాణులకు దయచూపడము.

వ॥ పాపం, దానిపిల్లలదగ్గిరికి యెట్లా వెడుతుంది !

మం॥ వింటావా, మళ్లీకట్టనా.

వ॥ వింటున్నా.

మం॥ జంతువులూ, పశులూ యే ఆపదలోవున్నా సంరక్షించి, ఆహారమిచ్చి—

వ॥ అయ్యో! కుక్కపట్టుకుంటోంది.

మం॥ కామాక్షీ వీణ్ణి కట్టెయ్యి.

వ॥ నేను వింటోవుంటా. నీరడా నువ్వు కుక్కను తోలెయ్యి.

మం॥ మీరువుండండి. కామాక్షీ నువ్వు తోలెయ్యి.

(కామాక్షి వెళ్ళింది).

మం॥ భదవద్గీతలో "ఆత్మవత్సర్వభూతానీ" అని ఋషులు—
నీ॥ పిల్లి చీకట్లో మెట్లాచూస్తుంది అమ్మమ్మా.
వ॥ పిన్నీ, కాకిని చెట్టుపైన పెట్టు.
మం॥ గౌతమబుద్ధుడు వున్నాడే ఆయన ఒక మహానీయుడు.
సమస్త జీవరాసుల్నీ— (కామాక్షివొచ్చింది.)
నీ॥ పిన్నీ! లడ్లు తయారై వుంటాయా?
మం॥ వినండి. కామాక్షీ! నువ్వూవిను— యీ సమస్త ప్రపంచ
మూ పరమాత్మ నిండివుంది. నీలో ఆత్మా, పిల్లిలో ఆత్మా,
చిలకలో ఆత్మా— అంతా ఒకటే!
(వసంతు తొండమీద రాళ్లేస్తున్నాడు).
నీ॥ పందిలో ఆత్మ నాదికాదు.
మం॥ ఒరే, నేను చెప్పేదేమిటి, నువ్వుచేసేదేమిటి? తొండ
నిన్నేం చేసింది.
వ॥ కరుస్తుంది.
మం॥ తొండ కరిచిందే!
వ॥ కరవలేదు. కరుస్తుంది.
మం॥ నీకెట్లా తెలుసు?
వ॥ కరిచేట్టుచూస్తోంది.
మం॥ సరేకాని మీరెందుకా పిల్లిని ఏడిపించారు?
నీ॥ మరి అది పీకింది.
మం॥ వినుముందు. మీకు నేనేం తక్కువచేశాను? ఆడుకోడా
నికి వొస్తువులు లేవా? యెన్ని బొమ్మలు కొనిపెట్టాను.
నేను కొనుక్కుంటున్నానా?
వ॥ అదికాదు.

మం॥ వినుముందు. యింతా మీకు నేను ప్రేమతో—

నీ॥ పిల్లి కాళ్ళకింద దిండువలె మెత్తగానుండును.

మం॥ చాలు, వూరుకో దాన్ని బండీకి యెందుకు కట్టారు?

నీ॥ మరేం కట్టం? కుక్క కరవొచ్చింది.

మం॥ మీవంశం యెటువంటిది, చీమచస్తేచూసి సహించలేని దయాపూర్వులే మీపూర్వులు. మీ తాత నల్లిని చంపడానికి సంకోచించేవారే!

వ॥ ఆపటంలోవున్న తాతయ్యేనా?

నీ॥ అది తాతయ్యకాదు. ఎవరో అబ్బాయి.

మం॥ అవును. అప్పుడట్లా వుండేవారు.

నీ॥ నువ్వు తాతయ్యతో యెప్పుడూ మాట్లాడనే లేదుటగా!

మం॥ మాట్లాడాలా యేమిటి? మీతాతయ్య నాకిక్కడ నివశిస్తున్నాడు. (గుండె చూపింది).

వ॥ తగలపెట్టారుగా?

నీ॥ పాతిపెట్టారు.

వ॥ మరి అమ్మమ్మలోపల యెట్లావున్నాడు? తాతయ్యని తిన్నావా, అమ్మమ్మా! కొన్నాళ్ళకి మళ్లీ తాతయ్య నీ లోపల్నించి పుడతాడా?

నీ॥ గుండెల్లోకాదు పిల్లలుండేది పొట్టలో.

మం॥ వీళ్లని తీసుకుపో, కామాక్షీ! అబ్బా యెక్కడిబుద్ధులో వీళ్లకి! యివన్నీ మీ అమ్మేనా చెప్పింది.

కా॥ పొద్దున్న నన్ను లంజ—

మం॥ ఛీ, ఛీ, యీ తోటలో, యీ ఆవరణలో—

నీ॥ యీ పంజరంలో-

మం॥ అల్లాంటిమాటలు వినపడకూడదు- వసంత్, అన్నావా-
వ॥ ఏమిటి?
మం॥ ఆమాట.
వ॥ ఏమాట?
మం॥ పిన్ని అనలా-
వ॥ యేమంది?
మం॥ వెళ్లండి. పొండి యిక్కణ్ణించి.
వ॥ మంచి అమ్మమ్మ.

(గంతులేస్తో వెళ్లారు)

మం॥ అబ్బా, యెక్కడిపిల్లలు! నా ప్రాణాలు తీస్తున్నారు. ఎంత భద్రంగా పెంచినా, యీ బుద్ధులు యెక్కణ్ణించి నేర్చుకుంటారో! ఆ గోల పోనీ. విను. నువ్వు చాలా అదృష్ట వంతురాలివి. ఇంత యెదిగినదానికి నీకు సంబంధం దొరక డమే ఆదృష్టం. అందులో మావంటి వంశం వుండే అది దొరకడం చాలా సుకృతం చేసుకుంటేనేగాని తటస్థించదు. మా తాత, మా అత్తవారి తాత, అందరూ యెంత మర్యాద, యెంత హోదా కలవారో నీకు రేపు చదివి విని పిస్తాను. యింత బీదదానివి—
కా॥ నేను బీదదాన్ని కాదు.
మం॥ పోనీ పెళ్ళికాక యెదిగిన—
కా॥ యేమీకాదు. నాకు చాలా మంచిసంబంధాలువొచ్చాయి.
మం॥ వొస్తే చేసుకోకపోయినావూ? యిదో, నీకంటె వయ సులో మూడింతలు పెద్దదాన్ని నీపుటకలకి అప్పుడే ముసలి దాన్నైనాను. నీ కేం తెలుసునని వాదిస్తావు, వూరుకో.

కా॥ కాదు. ఐ. సి. యస్. పరీక్ష పాసైనవాళ్లుకూడా నన్ని
    మ్మని వొచ్చారు.
మం॥ వాళ్ళసంగతి తెలీం దెవరికి! పోకిరీ, చెటకారీ దరిద్రులు.
    అట్లాంటివాళ్లని యెంతమందిని చూశానో! మా కుటుం
    బానికీ, మర్యాదకీ, సాంప్రిదాయానికీ సాటా! వాళ్లని
    గుమ్మం తొక్కనిచ్చేవారా, మా మామగారు!......
    నీకు తెలీదు. అట్లాంటి వ్రూహాలన్నీ పెట్టుకుని నువ్వు కోడలు
    కావడం మాకేదో గొప్ప మేహానత్ అనుకుంటున్నావు
    గావును! ఆ వెర్రివేషాలు వొదులుకో, నమ్రత నేర్చుకో,
    ముఖ్యం. యేదో తండ్రి బుద్ధితక్కువగా పాడుపని చేసి
    నందుకు యిట్లా అయిందే దానిగతి, అని దయదలిచి నీ
    మీద—
కా॥ మా నాన్నగారి నేమి అనకండి. ఆయనంత గొప్పాయని
    యీలోకంలో లేరు. యీ వాళ వొస్తారు, చూస్తారుగా.
మం॥ మీ నాన్నగారు గొప్పవారే కావొచ్చు. కాని యింక
    మీ నాన్న గొప్పతనమా నువ్వు తెలుచుకోవలసింది, లేక
    నీ భర్త గొప్పతనమా?
కా॥ మా నాన్నగారంత గొప్పవారుకారు ఎవరూకూడా.
మం॥ బాగానే చేస్తావు కాపరం! యిదుగో ముందేవిను. యెటు
    వంటివాడుకానీ, భర్తని దైవంగా చూడడం సంసారంలో
    మొదటి విధి. నేనీ విధంగానే ప్రివర్తించానా! ఆయన పద
    మూడో యేటే చిన్నతనంలోనే పోయినారుగాని, మహా
    భక్తులు మహావుదార పురుషులు కనుకనే యీశ్వరుడు
    తీసుకుపోయినాడు.

(వెంకటచలం వొచ్చాడు).

సరే కామాక్షీ యింక వెళ్లు. ఆ పిల్లలేం అల్లరిచేస్తున్నారో ?

(కామాక్షి వెళ్ళింది).

చూశావా, మరి, యీ పిల్లని బాగా! చాలా చురుకయింది. బుద్ధిశాలి. నీ అదృష్టంకొద్దీ దొరికింది. విమలవిషయం యింక దిగులు మానెయ్యి ... దానిమీద దయదలిచి ఐనాసరే మాట్లాడావంటే లాభంలేదు. మరీ యింత అవివేకివేం నువ్వు? నాముందు అన్నీ యిట్లా వొప్పుకుంటావు. మళ్లీ దానిమాటలు వినగానే అన్నీ మరిచిపోయి మెత్తపడి అది అడిగిందల్లా అంగీకరిస్తావు.

వెం॥ ఆ నారాయణ మరీ మితిమీరిపోతున్నాడు. పొద్దున్న కామాక్షితో కలియబడి—

మం॥ వాడిసంగతి నేను చూస్తానులే.

వెం॥ అంతే, అట్లా అంటావు. వూరుకుంటావు. వాడు నన్ను పెట్టే యిబ్బందులూ, అవమానాలూ నీకు తెలీవు. యెక్కడ కనపడ్డా పందికొక్కు అంటాడు. నా పిల్లలముందు విమలముందు, అందరిముందూ యెందుకు వాణ్ణి యిట్లా వుణ్ణిచ్చి ఆదరిస్తావో తెలీదు. యింక నేను వూరుకోను.

మం॥ ఆ విషయమై నేను చాలా ఆలోచిస్తున్నాను. నా అక్క అంత విశ్వాసంతో నాబాధ్యతపైని, వీణ్ణి వొదిలితే—

వెం॥ ఐతే వీణ్ణి యిట్లా నన్నేడిపించమందా యేమిటె, మీ అక్క!

మం॥ (నవ్వుతో) యేడిపించడంయేమిటి యింత పెద్దవాణ్ణి. మొగవాడివి నువ్వే అట్లా దిక్కులేకండా యేడుస్తోవుంటే, నేనెంతవరకు తంటాలుపడను చెప్పు.

వెం॥ నే నేం చెయ్యను?

మం॥ చాలనై తే తన్ను.

వెం॥ తన్నులా! యింక తన్నవలిసిందే!

మం॥ అది చాతకాకపోతే, భార్యనన్నా జాగ్రత్తపెట్టుకో.

వెం॥ పెట్టుకోడమెట్లా? వాడు మరీ మితిమీరి భయం, భక్తి లేక మరి పైకి వొస్తొంటే! పాపం విమల మాత్రం యెంత యేడ్చింది మొదట్లో వాడు తనని అవమానం చేస్తున్నాడని.

మం॥ దొంగ యేడుపులు.

వెం॥ కాని నేను వాణ్ణేమన్నా చేద్దామంటే దుండగీడు, దానికి పది రెట్లు చేస్తాడని వూరుకున్నాను. వెళ్ళకొట్టమంటే నువ్వు వొప్పుకోవై తివి!

మం॥ యింక నీతో పోట్లాడేవాణ్ణల్లా వెళ్ళకొడుతో వుంటే బాగానే జరుగుతుంది నాకు!

వెం॥ యిప్పుడు కామాక్షిని సాగించాడు చూడు. వీడినోటికీ చేతికీ అడ్డంలేదు. గ్రిహచారమన్నా తప్పిచుకోగలంకాని వీణ్ణించి తప్పించుకునేది దుస్సాధ్యంగావుంది. యెట్లా వొదుల్చుకోడం. ఒక్కనిమషం నాకు శాంతి, నిద్రలేకండా నన్ను కాల్చుకు తింటోంది యీ పిశాచం చిన్నప్పణ్ణించి! నన్ను చూస్తే వాడికంత కడుపుమంట యెందుకు?

మం॥ నీకు సమస్త సౌఖ్యాలూ వున్నాయి, నీ యీడువాడే కదా, వాడికేముంది మరి! యీర్ష్య వుండదూ?

వెం॥ అదుగో మళ్లీ, వాడికీ నాకూ సాపత్యం తీసుకొస్తావేమిటి? చాకలి వెధవకీ నాకూ, నా భార్యల్ని చూస్తే వాడికెందుకు కాంక్ష! యింక లోకంలో ఆడవాళ్లు లేరూ!

మం॥ వాళ్లని మాత్రిం వొదిలాడా ?

వెం॥ వూరికే వాణ్ణెందుకు వెనకవేసుకు వొస్తావట్లా! యింక నేను వూరుకోను. నాకు వెర్రెక్కుతోంది. నేనేం చెయ్యలేని వాణ్ణీ, చాతకానివాణ్ణీ అనేకదా, బహిరంగంగా నా కళ్ల ముందే, నా భార్యతో యిట్లా పరియాచకా లాడ్డం! పోనీ విమల ఐతే సరే – యిప్పుడీ–

మం॥ నేను చివాట్లువేస్తాలే వాణ్ణి. వాడు చాలా చెడ్డవాడు. వాడిజోలికి వెళ్లకు.

వెం॥ యెన్నిసార్లో యిట్లా –

మం॥ యేంచెయ్యను ? వినడు. ఇంత బుద్ధిహీనుణ్ణి చూడలేదు. యెందుకిట్లా ఐనాడో! నా పాపఖర్మం! నాప్రాణాలు కొరుక్కుతింటున్నాడు. చావన్నా చావడు.

వెం॥ చావకపోతే, చంపితేసరి !

(వెంకటచలం వెళ్లాడు. కొంచెంసేపు ఆలోచనలో బాధలో మంగమ్మ కూచుంది. తోటవాడు వొచ్చాడు.)

తో॥ అమ్మా, యీ సపోటా చెట్టు యెండిపోతోందండి.

మం॥ సరేకాని నీ కూతురుసంగతేంచేశావు ? దయచూపి చూపి దాన్ని కాస్తా చెడకొట్టావుకద! మొదటినించీ నేను చెపుతోనే వున్నాను. దాని విసురు, నడకలూ, వెకిలినవ్వులూ, దొంగచూపులూ, చూడగానే అనుకున్నాను, అది యేనాడో నీ కొంప ముంచేదే నని. నామాటలు విన్నావా దాన్ని జాగ్రత్తపెట్టమంటే! నేనన్నదంతా అక్షరాలా జరిగిందా ?

తో॥ ఏదో ఐపోయింది. బీధవాళ్లంగనక మాసంగతి బైటికొచ్చింది.

మం॥ సరేలే యిదుగో; యిట్లాంటివి యెక్కడ జరిగినా వూరు కోను నేను. నీకూ తెలుస్తోనేవుంది, ఆసంగతి మళ్లీ చెపుతున్నాను. అది యిక్కడ వుండడం మాకూ అపరిదిష్ట. యింక దానికోసం వొచ్చేవాళ్లూ పొయ్యేవాళ్లూ—

తో॥ (కోపంతో) యెవరండీ వొచ్చేవాళ్లూ, పొయ్యేవాళ్లూ, అందరూ లోపల్నించేగాని! బైటనుంచెవరూ లేరు.

మం॥ యీ నాడు యిక్కడా, రేపు వూరువెంబడీ— అదంతా నాకెందుకు? అది యిక్కడవుండడానికి వీల్లేదు. దాన్ని వొద ల్లేకపోతే మీరూపొండి.

తో॥ యింక తప్పకపోతే, వెడతాంలెండి, కాని మక్తా డబ్బిచ్చాచమే, అది యిచ్చెయ్యండి.

మం॥ యెందుకిస్తాము?

తో॥ యేం న్యాయమండీ? బిడ్డ పొరపాటుపనిచేస్తే, కడుపులో పెట్టుకుంటారా, యింటోంచి తరిమేస్తారా? నాలిక తిట్టిందని కోసిపారేసుకునే వాడుంటాడండీ? బిడ్డల్ని కన్నకడుపైతే నామాటలు మీ కర్థమవును. మీకేం అపకారంచేసిందండీ! దానికి అపకారం చేసినవాళ్లు మీమనసుకి బాగానేవున్నారు.

మం॥ అదంతా సరేనోయ్. బిడ్డలు వుంటే గుణవంతులుగా వుండాలి. యీ నీచపు పను లేమిటి? అందులో ఆడది! యిదుగో లోక మెంత పాడవుతున్నా నీతీ, దుర్నీతీ విచక్షణ యింకా నన్ను వొదల్లేదు మరి. మావంశం అట్లాంటిది.

(లోపలినుంచి లక్ష్మి 'అయ్యా, యీాయనచూడు' అని కేకేసి పరు గెత్తుకుంటో వొచ్చింది. పన్నెండేండ్లు.)

మం॥ (లక్ష్మితో) ఒసే, నీ కెన్నిసార్లు చెప్పాను. ఆడపిల్ల లట్లా బిగ్గిరిగా కేకలెయ్యకూడదని! దూడలాగు అట్లా పరుగెత్తు తావు సిగ్గులేదూ!

ల॥ ఆ నారాయణగారు చూడండమ్మా!

మం॥ యేమిటి?

ల॥ వొద్దంటే యెప్పుడూ పట్టుకుంటారు?

మం॥ ఐతేమాత్రం, ఆడపిల్లవి అట్లా అరుస్తావా?

ల॥ (సిగ్గుతో) పట్టుకుంటారండీ!

మం॥ ఐతేమాత్రం—

తో॥ ఐతే, ఐతే,— యేం తెలీటంలా? — యీడొచ్చిన పిల్లని— యేమిటది? వాడితల పగలకొడతా, యేడీ?

మం॥ వుండు నేను మాటాడుతాను (లక్ష్మితో) నారాయణ యెక్కడ వున్నాడు?

ల॥ అడుగో, ఆకుండు దగ్గిర.

మం॥ రా, రా, నేను కనుక్కుంటాను.

(మంగమ్మ వెళ్లింది. నారాయణ పక్కనించి నవ్వుతో వొచ్చి లక్ష్మిని పట్టుకున్నాడు.)

నా॥ యిప్పుడేం చేస్తావు?

ల॥ అమ్మగారూ, అమ్మగారూ - లంజి -

నా॥ అమ్మా, లేదు ఏమీలేదు.

(నోరుమూస్తున్నాడు. సుందరేశయ్య రైలుసంచితో వొచ్చాడు. లక్ష్మి పారిపోయింది.)

నా॥ యెవడోయ్, ఈ అవతారం?

సుం॥ మంగమ్మగారు వున్నారా?

నా॥ నువ్వా అరవపిల్ల అబ్బివి కాదుకద!

సుం॥ యెవరునువ్వు?

నా॥ దాని మొగుణ్ణి.

సుం॥ (ఆశ్చర్యంతో) నేను నీమామని.

నా॥ మామోయ్, నీ అల్లుణ్ణి ముద్దెట్టుకో, వూ! చాలా దొడ్డ మామవి.

సుం॥ అంటే -

నా॥ అంటే, అంట్లవెధవ్వి అన్నమాట.

సుం॥ నేనా! యెందుకు.

నా॥ యెందుకా అంట్లవెధవఅంటే వూరుకున్నవాడిని అంట్ల వెధవ్వికాక యింకేమిటి?

సుం॥ నీకా, కామాక్షినిచ్చింది!

నా॥ (పాడుతున్నాడు) నాకేనోయ్, మామయ్యా, నాకేనోయ్.

సుం॥ ఆపాట ఆపి విను.

నా॥ నాకేం కట్నాలు తెచ్చావు, ఆసంచీలో!

సుం॥ మందులు.

నా॥ మందులు దేనికి?

సుం॥ పిచ్చికి.

నా॥ (నవ్వుతో) అయిపోయింది. ముడిపడ్డది, పిచ్చివాడికి. రా, మామా కావిలించుకో. కాని బలే చమక్కులు నేర్పావు కుర్రదానికి. చాలా జాణ.

సుం॥ హరహరా! తాగావా?

నా॥ నీ కూతుర్ని.

సుం॥ యిదేం సాంప్రిదాయంరా నాయనా!

నా॥ తాగుడు సాంప్రదాయాలు. సంచీలో బుడ్లున్నాయా, గుడ్లు న్నాయా?

సుం॥ తుపాకీ గుళ్ళున్నాయి.

నా॥ బలే ముసలివాడివి. రాత్రికి చెట్టుకింద తాగుదాం. నీకు గుంటలేదే? వంటది బోడిదిగాని, యింకా బిగువు చెడలేదు.

సుం॥ సదాశివ, సదాశివ.

(మంగమ్మ వొచ్చింది)

మం॥ యేదో తగాదాపెట్టావా అప్పుడే, వెధవా పో.

(నారాయణ పోతున్నాడు)

సుం॥ యీయన- యీయన-

మం॥ యెవడోలెండి వాడిమాటలకేం యేమనుకోకండి.

సుం॥ మంగమ్మ గారనుకుంటాను.

మం॥ అవును మీరు కామాక్షి తండ్రిగారేనా?

సుం॥ వాడేనా నా అల్లుడు?

మం॥ కాదు.

సుం॥ అమ్మయ్యా! అవుననుకుని చచ్చిపోయినాను.

మం॥ (చిరునవ్వుతో) సలక్షణంగా అమ్మాయి వివాహం జరిగింది. యేదో అడావిడి కాకండా కానిచ్చాను.

సుం॥ అవును రెండో పెళ్ళికద!

(ఒకరి నొకరు బాగా చూసి, జ్ఞాపకం తెచ్చుకుని అనుమానపడుతున్నారు.)

మం॥ మీరు పెళ్ళికి లేకపోవడం చాలా లోపంగా కనపడ్డది. పెళ్ళికివొచ్చిన బంధువులెవరూ లేకపోవడంచాత సరిపోయింది గాని, లేకపోతే చాలా వికృతంగా కనపడి వుండును.

సుం॥ మరేంచెయ్యను? రాశానుగా? సరిగా ఆనాటికి మళ్ళీ నా దగ్గు తిరగబెట్టింది.

(ఒకరి నొకరు చూసుకుంటున్నారు.)

మం॥ (నెమ్మదిగా) మీపేరు- సుందరేశయ్యగారు- పూర్వం- యిరవై - యిరవై ఐదేళ్ల కిందట-

సుం॥ మీరే, మంగమ్మగారంటే? - నువ్వే,

(మంగమ్మ మాట్లాడకండా చూస్తోంది)

మం॥ యింకా జ్ఞాపకముందీ?

సుం॥ ప్రతి వుదయమూ, సాయంత్రమూ, జ్ఞాపకజలంతో ఆ నామదేవత నభిషేకం చేస్తావుంటే!

మం॥ (కోపంతో) యిన్నేళ్ళువొచ్చినా, దొంగమాటలు పూన లేదా?

సుం॥ (ఆశ్చర్యంతో) దొంగమాటలా, యెందుకు?

మం॥ కాక-

సుం॥ ఆకోపమేమిటి?

(మంగమ్మకు జ్ఞాపకం తిరగబెట్టి కోపం యెక్కువై పోతోంది.)

మం॥ మళ్ళీ ఆపాడుపేరు విన్నానా, యీ జన్మకి వొదిలిపోయిం దనుకున్నానుకద శని! ఆ పేరులో యే అక్షరంగాని విన్నానా, ఆనాటికింక ఆనందమూ, శాంతీ ధ్వంసమౌతాయి. మీరా! మళ్ళీ—మీరా - నిజమే!

సు॥ యేమిటీ!

మం॥ నేనని తెలిసే యీపన్నాగం పన్నావు. అహో! లోకంలో యెక్కడ కనపడతావోనని, భయంతో, యీ మూల దాక్కుంటే యిక్కడికీ దాపరించావా! యీ సంబంధం—వియ్యంకుడివా- వీల్లేదు. యెంతద్రోహం! అప్పుడు తెలీ కూడదూ? అందుకే పెళ్ళిముందు పాడుమొహం చూపించ లేదు.

సు॥ యేదో భ్రమలో మాట్లాడుతున్నావు. యెందుకీ దురా వేశం?

మం॥ అడుగుతున్నారా? యెంత నటన! యెంత నిర్మాలిన్యం ఆ కళ్ళలో.

సు॥ నన్ను 'మీరు' అంటావేమిటె?

మం॥ కాక యేమనాలి. సిగ్గుగా లేదూ.

సు॥ సిగ్గా! దేనికి?

మం॥ అన్నిటికీనీ— చివరికి ఈమోసానికి.

సు॥ యేసాక్షిగా ప్రమాణం చెయ్యమన్నా చేస్తాను. నేను మోసాన్ని యెన్నడూ నీ యెడల తలపెట్టలేదు. యీ గడి చిన నిమిషంవరకు మంగమ్మగారంటే నువ్వని తెలీదు.

మం॥ నమ్మగలనా?

సుం॥ నమ్మాలి.

మం॥ (కోపంతో, దుఃఖంతో, అణుచుకోలేని సిగ్గుతో) నమ్మను. ఒకప్పుడు నీనోటినించి యింతకన్న అనృతాలైన మాటలే నమ్మాను. కాని, యింక నమ్మను. నమ్మమని అడగడానికి నోరెట్లా వొచ్చింది. సిగ్గులేనివాడా!

సుం॥ (కొంచం కోపం తెచ్చుకుని) ఎందుకట్లా దూషిస్తావు? సిగ్గా! యెందుకు నాకు సిగ్గు? నేను నీకోసం చేసిన త్యాగానికా— అపకారం జరిగింది. వొప్పుకున్నాను. తలవొంచుకున్నాను. నేను వొక్కణ్ణేనా? ఒక్క మొగవాడే అన్నిటికీ—

మం॥ కాని నీకేం? నువ్వేమన్నా—

సుం॥ అవును. కాని లోకం స్త్రీ యెడల కఠినం కావడంచాత నువ్వు నలిగివుంటావు. దానికి నాదే తప్పా!

మం॥ లోకమేనా? లోకం వొక్కటే! నువ్వేంచెయ్యనేలేదూ? నువ్వేమీ అన్యాయం యెరగనే యెరగవ్వూ?

సుం॥ నాకు సిగ్గుపడవలసిందేమీ జ్ఞాపకం రావడంలేదు.

మం॥ (ఆవేశంతో) లేదూ? సిగ్గుపడవలిసిం దేమీలేదూ? నిజంగానే! యింత అన్యాయం. యింత ఆత్మవంచన యెక్కడన్నా వుంటుందా? దినదినమూ నేనెంత బాధ పడ్డాను! నన్నా బాధలో ముంచడానికి కారణమైన ధూర్తుడు, దిగులుపడి, పశ్చాత్తాపంతో దహించుకుని పడుస్తున్నాడనే నమ్మకమువల్లనే జీవించగలిగాను యీ యిరవై యేళ్లూ. నిజమే! సిగ్గుపడనేలేదూ? పైగా యేమరు త్యాగమూ! సిగ్గుకదూ! నీ నాలిక చీలికలుకాలేదూ! నన్ను మోసంచేసి, నమ్మించి, గోతులో కీడ్వడం.

సుం॥ నా అంతరాత్మ నిర్మలమని నాకు తెలిసినప్పుడు, నేను తెలుసుకోవలసిన అవసరమేమిటి? పరస్పర భిన్నాభిప్రాయాలను యెవరిదివారు దాచిపెట్టుకుని, మరిచి, ప్రస్తుత వ్యవహారమువేపు కళ్లుతిప్పకూడదూ? పోనీ భవిష్యత్తు ఆలోచించకూడదా?

మం॥ భవిష్యత్తా! నీతో వియ్యమా? పో, నీ అమ్మాయినితీసుకుపో. యీవేపురావొద్దునువ్వు. వెళ్లునీమొహాన్ని భరించలేను.

సుం॥ నిజంగానే! పిచ్చా?

మం॥ యీనాడేం? యిరవై యేళ్ళకిందటే ఎత్తింది పెద్దపిచ్చి-మదపిచ్చి.

సుం॥ సరే! యింకేమనను!

మం॥ వెళ్ళండి. యేమీ అనవొద్దు. వెళ్ళండి.

సుం॥ సరే, వెడతాను. యింక అంత కారణంలేని మూర్ఖానికి జవాబేముంది? సరే.

మం॥ వెళ్ళు.

సుం॥ కామాక్షి?

మం॥ (ఆలోచనగా) కామాక్షి! కామాక్షికేం? వుంటుంది.

సుం॥ యింత ఘాతుకుడి పిల్ల-

మం॥ అవును. దాన్ని చూసినప్పుడల్లా మీరు జ్ఞాపకం రాకండా వుంటారా? ఆకళ్ళు అవే. మొదటిరోజే తోచింది, యీచల్లని కళ్లని యెక్కడో యిదివరకు చూశానే అని. కాని పోనీ వుణ్ణీండి. దాన్ని వుణ్ణీండిలెండి.

సుం॥ నన్ను ద్వేషించే హృదయం నా కూతుర్ని ప్రేమిస్తుందా! కామాక్షిని వొదిలి లోకంలో నే నేం చెయ్యను? అది

మాత్రం నన్ను వొదిలి వుండగలదా? మేమిద్దరం కలిసివుండే పద్ధతిమీద నేకద, యీ వివాహం యేర్పాటు అయింది.

మం॥ దాని కాపరం పాడుచేసి తీసుకుపోయి పిల్లనేం చేసుకుం టారు? పాడుచేసిన జీవితాలు చాలవ్రా?

సుం॥ యేదో వొకటి చేసుకుంటాను. అమ్ముకుంటాను. నీకెం దుకు? రమ్మను.

మం॥ అట్లా ఐతే తీసుకుపో. నీ వెనక అది పరిగెత్తుకుని లేచిపోతే అదో అపరిదిష్ట.

(తోటవాడితో)

వొరేయ్, కామాక్షినిరమ్మను.

(కొంచెంసేపు మాట్లాడకండా నుంచున్నారు)

సుం॥ నువ్వింత సులభంగా పొమ్మంటున్నావుగాని, ఆకొత్తదంప తుల కెట్లావుంటుంది?

మం॥ ఆసంగతికూడా మీకెందుకు?

సుం॥ నా హృదయమింకా జీవించివుందిగనుక.

మం॥ యెందుకు? యితరుల హృదయాలను భగ్నం చేసేందు కేనా?

సుం॥ కాదు, యీ విచారాలూ నిందారోపణలూ అనుభవిం చేందుకు.

(మళ్లీ వూరుకున్నారు. కామాక్షి వెంకటచలం వొచ్చారు)

కా॥ (సంతోషంతో) నాన్నా, వొచ్చారా.

(పాదాలకి నమస్కారంచేసింది. సుందరేశయ్య యేమనడానికి తోచక ఆలోచించి)

సుం॥ దీర్ఘసుమంగలీభవ!

(లేవతీసి కావిలించుకున్నాడు. వెంకటచలం నమస్కారం చెయ్యా బోయినాడు.)

మం॥ వుండు. వుండు. తరువాతచెపుతాలే.

(వెంకటచలం ఆశ్చర్యంతో చూస్తువ్నాడు

(సుందరేశయ్యతో) వెళ్లండి.

వెం॥ యేమిటి?

మం॥ ఆయన కూతుర్ని ఆయన తీసుకు వెడతారుట.

వెం॥ మరి-

మం॥ నీకు తెలీదు వూరుకో. ఈసంబంధంకాకపోతే యింకోటీ-

కా॥ యేమిటినాన్నా?

సుం॥ నేనిదవరకీమె నెరుగుదును. నేనిక్కడ వుండడం యీమెకి యిష్టంలేదు.

మం॥ నేననలేదు ఆమాటలు-

సుం॥ అన్నావు.

మం॥ అనలేదు. మీరూ అన్నది.

కా॥ (మంగమ్మతో) నేను వుండడం మీకిష్టంలేదా ?

మం॥ మీనాయనగారు వుంచనంటున్నారుగా—

సుం॥ నే ననలేదు.

కా॥ మరి—

మం॥ కామాక్షీ, నీమీద నాకు చాలాదయే, కాని నీవంశం సంగతి తెలిసింతరవాత నిన్ను నిరాకరించడం నావిధి అయింది.

కా॥ (కోపంతో) యేంవంశమేమిటి మాది ?

మం॥ నీ కప్పుడే యీ విషయా లర్థంకావు.

కా॥ యింకా తెలీవా, పెళ్ళైనా? పొద్దున్న పెళ్లిచేసి సాయంత్రం పొమ్మనే వాళ్లని. దీని అర్థమేమిటో చెప్పమని అడగడానికి నాకర్హతలేదా?

మం॥ (ఆలోచించి) యివి చిన్న పిల్లలు జోక్యంకలగచేసుకోవలసిన విషయాలు కావు.

కా॥ (వెంకటచలంతో) మీరేమంటారు? మీరూ చిన్నపిల్లలేనేమో!

వెం॥ (మంగమ్మతో) యీ గోల యేమిటో చెప్పకూడదూ?

మం॥ యేం చెప్పను?

సుం॥ ఆమెకి తెలిస్తేగా?

కా॥ కాని నేను వెళ్లాలీ! నాన్నా నేను నీ దగ్గిరేవుంటాను, పెళ్లివొద్దు యేమీవొద్దని యెంతయేడ్చినా, యేదో నీతర వాత నేనేమౌతానో అని భయపడి, నన్ను బతిమాలుకుని, నీ కోసమని వొప్పించావు. యీమెని నమ్మి నన్ను ముందు పంపించినందు కేగద యింత చులకనైనాము. (మంగమ్మతో) యేమండీ! మీరు పెళ్లయిందంటే, అయిందే. కాలేదంటే కాలేదూ! పైగా మావంశమంటారు? ఏమిటండీ మావంశం సంగతి! చెప్పరాదూ?

మం॥ మీనాన్న చెపుతారు.

కా॥ యేం నాన్నా, యేమిటది?

సుం॥ మోమో! యేంచెప్పను! యేం లే దసలు.

కా॥ యీ గోలంతా యెందుకు? యిప్పుడు నేనిక్కడనించి యెందుకు కదలాలి!

సుం॥ నన్ను పొమ్మన్నదిగనక.

కా॥ యెందుకు ?

సుం॥ నాకూ తెలీదు.

కా॥ సరే, పోదాంపద (వెంకటచలంతో) వెడతానండీ !

వెం॥ (కన్నీళ్లతో) వొద్దు.

కా॥ మరి యేంచెయ్యను ?

వెం॥ నేనూ వొస్తాను.

కా॥ యేం నాన్నా ?

సుం॥ అంతకంటేనా ; కాని మేము బీదవాళ్లం. ముందు చెప్పుతున్నాను.

మం॥ (వెంకటచలంతో) యేమిటీ ! నువ్వూవ్వ వెడతావా ?

వెం॥ మరి - (కన్నీళ్లుపెట్టుకుంటున్నాడు)

సుం॥ పోనీ నేను వెడతాను. మా అమ్మాయిని వుంచుకో.

కా॥ యేమిటినాన్నా ! కారణం లేకండా పొమ్మంటే, నువ్వట్లా వూరుకుంటున్నావుగాని: యేం గతిలేదా మనకి ? కావలిస్తే యీయన వొస్తారు, లేకపోతేలేదు. వెడదాం, రా. నిన్ను మర్యాద చెయ్యకపోయింతరవాత నేనెందుకిక్కడ !

వెం॥ అంతేనా కామాక్షీ !

కా॥ యేంచెయ్యను ? మీరూ రండి.

సుం॥ (మంగమ్మతో) కారణమేమీలేనిది, యేదోభ్రమ మనసులోపెట్టుకుని మమ్మన్నందర్నీ అవస్త పెడుతున్నావు. స్పష్టంగా మాట్లాడితే యెంత బావుంటుంది !

మం॥ యేమీ లాభంలేదు.

సుం॥ పోనీ, నేను వేడుకుంటున్నాను. అమ్మాయీ, నువ్వూ నీ పెనిమిటీ లోపలికి వెళ్లండి ఒక్కసారి. నేను -

కా॥ యేమిటి నాన్నా, యింకా మాట్లాడేదేమిటి? యేమిటో అవివేకము, విధేయతా! పోనీ, పొమ్మంటే పోదాం.

సుం॥ నేను చెపుతాగా, నువ్వు వెళ్లు.

కా॥ కావలిస్తే నువ్వుండు, నేనుమాత్రం -

మం॥ యిందాకన్నించి నీకు బోధించిన నీతులన్నీ యేమైనాయి.

కా॥ అవన్నీ మీకోడలికి బోధించుకున్నారు, నాకుకాదు.

సుం॥ అమ్మాయీ, యేమిటా మాటలు. (కామాక్షీ వెంకటచలం వెడుతున్నారు.) నేను దాని దుఃఖాన్ని చూడలేను. దాన్ని వొదిలి నేను జీవించలేను. వాళ్లిద్దరి భావిసౌఖ్యమూ అభివృద్ధీ మనచేతులో వున్నాయి. నువ్వేదో జీవితమంతా భంగపడ్డానన్నావు నామూలంగా. మనిద్దరమూ కలిసి దాని జీవితాన్ని భగ్నం చేస్తాము. నాబిడ్డకోసం నా అభిమానాన్నంతా దిగమింగుకుని నీచేతులు పట్టుకుంటున్నా. నేను నీకు యేం ద్రోహంచేశానో, చేశానో లేదో - చేశానే అనుకో, బుద్ధిపూర్వకంగానే చేశాననుకో. క్షమించు.

మం॥ ఆసంగతి సరేలే, క్షమించడానికి నేనెవర్ని, పరమేశ్వరుడున్నాడు. కాని నిన్ను ప్రతిదినమూ యిక్కడ చూస్తూ వుంటే నాకు శాంతివుంటుందా? ప్రతి దినమూ యెవరిని నా హృదయశాంతికై శపించుకుంటున్నానో, ఆమనిషిని నా అతిథిగా, మిత్రుడిగా యెట్లా చూసుకోను? యేమో, చిన్నప్పుడు నన్ను మోసంచేసినట్టే, ఆజాలికళ్లతో అట్టా చూసి మళ్లీ యీనాడు -

సుం॥ (కొంచం సంతోషంగా) అన్యాయం, అన్యాయం, యిన్నేళ్లొచ్చి -

మం॥ వినండి. ముసలివార్లైనారు. దేహం ముడతలు పడ్డది. కాని మీకళ్లు అట్లానే – అనాటివల్లేనే సరిగ్గా - (అప్రయత్నంగా జ్ఞాపకస్ఫురణలో పడుతో) ఆవుదయం పెద్ద గాలిలో, సీగదిముందునుంచుని, నావంక జాలిగా - రాత్రంతా నిరాశచెందించిన క్రూరత్వానికి నేను బాధ్యురాలనైనట్టు, చిన్న వెలుతురులోనుంచుని .– (తెప్పరిలి) యేమో, యే నిముషాన, అప్రమత్తతలో – మళ్లీ, మళ్లీ నన్ను అవి వేకినిచేసి - వెళ్లు, వెళ్లు - (పెద్దగా) వొద్దు, వొద్దు మీరు వొచ్చినప్పణ్ణించి - పొండి మీరూ మీసంతానం, అందరూ అందరూ, నా జీవితంలోంచి, నాకళ్లముందునించి, వెళ్ళి పొండి ముందు. యింత విశాల ప్రపంచం వుండగా నేనే దొరి కానా నీకు వియ్యమందడానికి ?

సుం॥ యేమిటిది ? యేమిటి ?

(ఒక్కనిమిషం వూరుకుని మంగమ్మ శాంతపడ్డది)

మం॥ ఆశలేదు. యేనాడు నువ్వీ హృదయాన్ని అంత గాఢంగా గాయంచేశావో, అనాడే నాకూ నీకూ ముగిసింది. ఆనాడే శాశ్వతంగా లత తెగింది. యెప్పుడు నిన్నుచూసినా ఆగాయం రక్తంకారక మానదు.

సుం॥ అన్యాయం, అన్యాయం, అంటావు. నేనుచేసిన అన్యాయ మేమిటో స్పష్టంగా మాటలతో చెప్పు.

మం॥ చెపుతాను. చెప్పడానికేం ?

(ఆలోచిస్తోంది)

యేం చెప్పను? యెట్లాచెప్పను? యెంత ఆవేశంకిందో, ఆగ్రహంకిందనో మణిచిదాచిన వ్యవహారాన్ని విప్పనా? (ఆగింది.)

ముందు యేమెరగని నాతో ఆదురుద్దేశ్యాన్ని, మలిన మైన అనురాగాన్ని ప్రేరేపించింది నువ్వేనని వొప్పుకుంటావా?

సు॥ నేనా! మలినమా! కానీ—

మం॥ యేమిటి? యిదికూడానా దుర్మార్గుడా! నువ్వుకాదూ, ద్రోహీ?

సు॥ నేనేమన్నాను?

మం॥ పైగా యేమన్నానా! పురుషస్పర్శ అనేది అర్థముకాక ముందే భర్తపోయిన నన్ను తలిదండ్రులు అతిజాగ్రత్తతో, శాస్త్రపారాయణంలోనూ, ధర్మచరితాభరణంతోనూ, పార మార్థ చింతలోనూ పెంచుతోవుంటే బంధుత్వమిష చేత, యింటో స్వేచ్ఛనుపొంది క్రమంగా నామనసులో విషసర్పం వలె ప్రవేశించి, ఒక్కొటొక్కటిగా, నాదమన శక్తుల్ని నాశనంచేసి పైగా, పైగా - వుండు ఆరాత్రి వుత్తరరామ చరిత్ర చదువుతో, సీతచూపును వర్ణించి - అప్పుడుకదూ నావంక—

సు॥ (ఆగలేక) అప్పుడేనా! నిజమా! (సంతోషంతో) అప్పు డేనా మొదట నీ మనసు స్పృశించింది! యెన్నాళ్ళు బాధ పడ్డాను, నీమనోభావం తెలీక! మరి అన్నిరాత్రిలు, అన్ని గడియలు - ఆవర్షరాత్రివరకు- దాదాపు నెలరోజులు- యెం దుకు నన్నంతబాధపెట్టావు! అబ్బా! ఆవేదన! మధురమైన-

మం॥ (లజ్జతో) కాకపోతే, కన్యను, నవయువ్వన వంతురాలను మరి- (తెప్పెరిలి) పోనీలే, అదంతా యెందుకు? నువ్వు-

సు॥ అట్లాకాదు నిజంచెప్పు, అంతముందే నాపైన అనురాగ మంకురించిందా. యింకా అంతకు ముందో! అసలు నన్ను

మొదట చూచినప్పుడు- వెనకటింటి కిటికీదగ్గిర సగం చీక
ట్లోనూ-

మం॥ చాల్లే అదంతావుండనీ- కాని నన్ను అమాయకురాలిని,
నన్నంటావా ఆమాట!

సుం॥ (మరిచిపోయి) యేమాట?

మం॥ (మరిచిపోయి) యేమిటా?

(ప్రయత్నపూర్వకంగా ఆలోచిస్తోంది.)

యేదో, పోనీలే!

సుం॥ మరి చెప్పు నేనేం అన్యాయం చేశానో?

మం॥ (ఆలోచించి) ఆ నువ్వేవొచ్చి, పారమార్థికధ్యానలో-

సుం॥ యేం దొంగమాటలు! ఆవయసులో పారమార్థికచింతలా?

మం॥ వెక్కిరించకు. పూరికేకూచో- అవును- పారమార్థిక చిం
తలో కళ్ళు మూసుకుని నిద్రపోతున్న నామనసుని బలవం
తంగా రేకులు విప్పి-

సుం॥ నువ్వేఅంటివికద! ఆరాత్రే- ఆ ఉత్తరరామాయణం చది
వినరాత్రే- అప్పుడు నేనింకా కలలోనన్నా యీ విషయమై
అట్లాంటి-

మం॥ అవునేమో: కాని నీకేంతెలుసు? నేనిప్పుడు చెపితే తెలి
సిందిగాని-

సుం॥ నాకు స్పష్టంగా తెలీకపోవొచ్చు. కాని నా అంతరాత్మకి
తెలిసివుండదా? నీకే వ్యక్తంగాని, సిగ్గుతోకూడిన ప్రణయ
దృష్టులూ, నిద్రలో స్ఫురించే రహస్యపుకోర్కెలూ, నీవేళ్ళ
లోని కంపనా, నడకలోని సంభ్రమమూ, నామనసు కనిపెట్టి
వుండదనా? నేను చూట్టంలేదనుకున్నప్పుడు, నీకూ తెలీ

కండానే నీచూపులు నాముఖంనించి దొంగిలించిన ఆనందాన్ని నేనెరగనా?

మం॥ కాదు. అంతా నీ భ్రమ.

సుం॥ ఇంకేం చెప్పను?.........పోనీ ఆవర్ష రాత్రి,వొక్క త్తెవూ ఆపెద్ద విసురుగాలిలో నుంచున్నపుడు- (మైమరచి) నీపమిట దానిమ్మ చెట్టుపైకి యెగురుతో, నీ నున్నని నుదురుమీద నల్లగా చీకట్లో చీకటివలె ముంగురులు కదులుతో, నీహృదయంలోని భావాలవలె పరువులెత్తే కారుమబ్బులకేని, నీలేత మొహాన్ని తిప్పి (ఆనందంలో మునిగి మాట్లాడ్డం మరిచిపోయినాడు.)

మం॥ అప్పుడు—

సుం॥ అప్పుడు, చప్పుడుకాకుండా పక్కనవొచ్చి నుంచున్నాను. నువ్వు అట్లానేనుంచుని, వేళ్లతో యేదో వెతుకుతున్నట్టు, నీ చెయ్యి నా చేతివేపుజూచి — ప్రేమతో — నా వేళ్లని—

మం॥ కాదు భయంతో-

సుం॥ ప్రేమతో- ఆ బేధం తెలీదా?

మం॥ (కోపంతో) నీ హృదయ మాలిన్య మట్లాఅనిపించింది. కాని భయంతోనే, ఎన్నోసార్లు నేను ఆలోచించుకుని రూఢిచేసుకున్నాను- భయంతో నే నని- నేనే మీ లజ్జలేని దాన్ని కాదు- భయంతోనే—

సుం॥ అట్లా అనకు ఆవొక్క ఆనందాన్ని ఛేదించకు.

మం॥ (విసుకుతో) సరేలే - అప్పుడున్వ్వేంచేశావు - అసహాయనైన నన్ను దగ్గిరికి చేర్చుకుని - అదేదో చంపక పువ్వుల వాసనతైలం-

సుం॥ అదీ జ్ఞాపకముండే! నాకు మావాళ్లు పుస్తకాలకిచ్చిన వాటిల్లో రూపాయన్నర మిగుల్చుకుని కొన్నదది—

మం॥ వుండు నీవ్రాసిరితో నాచంపల్ని గాఢంగా కాలుస్తో దగ్గరగా నీకు, నీపెదిమలకి, దగ్గిరిగా, నా చంపని...... అబ్బా!

(అతని చెయ్యిగట్టిగా పట్టుకుంది)

జన్మానికల్లా - ఆ వొక్కరాత్రి - యింకరాదుకదా!

సుం॥ ఎట్లావుండేదానివి అప్పుడు! ఇన్నిదేశాలు తిరిగాను, కాని నిన్నుబోలినదాన్ని-

మం॥ (డెస్పిరిలి) పో, అదంతా, పోనీ. యిప్పుడెందుకు?... ...ఆ రాత్రి యేమన్నావు? ఇంక మనిద్దరి జీవితాలూ వొకటేనని, నన్నెన్నడూ అన్యాయం చెయ్యననీ - నువ్వు నన్ను బలవంతంచేసి, చేసిన అపరాధానికి నేను పశ్చాత్తాపపడి, భయపడి యేడుస్తోవుంటే - అనలేదూ? జ్ఞాపకం వుందా?

సుం॥ అన్నాను- ఏమీ?

మం॥ మరి ఆమాటలునమ్మేకద- నువ్వువెళ్ళిపోగానే యిల్లంతా చీకటైపొట్టై; వేదాంతం నిస్సారమూ, శాస్త్రిల వెర్రిప్రేలాపనలుగాతోచి, యింక నిలవలేక, అన్నిబంధనాల్నీ, బంధువుల్నీ త్యజించి, యిల్లువొదిలి, నీకోసంవొచ్చి, కోమలమైన నా యవ్వనాన్ని — నీ చేతులకి వొప్పగించింది, అందుకేగా, (కోపంతో) అవునా, అవునా, ఏంచేశావు, రాక్షసీ, పాతకీ, యేంచేశావు!

సుం॥ (నెమ్మదిగా) ఏంచేశానా? నువ్వు మరిచిన నీతినీ, ధర్మాన్నీ, శ్రేయస్సునీ నీకు బోధించి, తీసుకుపోయి,

యేదో వొంకచెప్పి నీతల్లిదగ్గర దిగపెట్టాను. అదే నీకు నే చేసిన పరమ ద్రోహం — అవునా?

మం॥ కాదూ?

సుం॥ ద్రోహామే!

మం॥ నాతో పరియాచకమా! నీవేపుజూచిన నా మృదు ప్రేమ లతని, ఖండించి, నలిపి — నమ్మించి, గొంతు నులిమి —

సుం॥ (ఆలోచనగా) ద్రోహమేనా? సరే, పోనీ. మరి యెందు కా ద్రోహం చేశాననుకున్నావు? నిన్ను, అంతగా నేకోరిన నిన్ను, నా ప్రాణ మంతటితోనూ ప్రేమించుకున్న నిన్ను, నీ ప్రేమని నిర్మూలం చెయ్యడం నాకు ఆనందమే అనుకున్నావా?

మం॥ కాకపోవొచ్చు —

సుం॥ నువ్వువొచ్చిన సాయింత్రం — ఈనాడు జరిగినట్టు అంతా జ్ఞాపకముంది — నువ్వు బండిదిగడం — సిగ్గుతో నుంచోడం — నల్లచుక్కలచీరె కట్టుకున్నావు అవునా — నా ఆశ్చర్యం — నీ పెదిమ వొణకడం.

మం॥ అబ్బా!

సుం॥ ఆసాయింత్రం — నిన్ను — ఒకరోజు — కాదు - ఆరాత్రికి నాకోసం, స్వేచ్ఛగా, స్వతంత్రంగా ప్రేమించుకోవాలని, నిర్భయంగా కావిలించుకోవాలని, నామనసెంత తెంపుచేసుకుందో నీకేంతెలుసు? కాని నేను ఒక్కచూపు దయగా చూశానా? ఒకసారి ముద్దుగా పిలిచానా? ఇద్దరమూ మహాపాతాళంలో కుంగిపోతామనుకుని —

మం॥ కాదు, ఏమీకాదు. ఏదోతాత్కాలికంగా నా హృదయంతో ఆడుకున్నావు — అవసరంతీరింది. యత్నం సఫలమయింది. నువ్వువెలిగించిన మంట కన్నీళ్లతో చల్లారుతుందనుకున్నావు. కాని భగ్గుమని నలుగురి కళ్లముందూ వుండింది. నాతెగింపు నీకు వుపదశ్రివం తీసుకొచ్చేప్పటికి — ఏంచేశావు? నాపతనానికి— వినాశనానికి హేతువైన నువ్వేం చేశావు! స్వార్థపరుడివై, భీరుడివై, నాఅవస్తను యోచించక కుంగిపోతున్న నాఅభిమానాన్ని — ఎండిపోయ్యే నారసభావాన్ని, మండిపోయ్యే నా యవ్వనాన్ని తలుచుకోక నీతిబోధలతో నాతల విరిగేట్టు —

సుం॥ వుండు- అన్యాయం- జరిగిపోయింది- పాతికేళ్ళ కిందటి ముచ్చట- ఎట్లా నీకిప్పుడు రుజువుచెయ్యడం! ఎన్నటికైనా ఆ యీశ్వరుడు నిజం తేల్చవలసిందే! ఎట్లా నమ్ముతావు. ఇరవై యేళ్ళనించి పాతుకున్న అబద్ధం — అపనమ్మకం — యీనాటి పదిమాటలతో చెదిరిపోతుందా!

మం॥ చెప్పరాదూ, ఆ నిజమేమిటో?

సుం॥ ఆ నిజమేమిటంటే- నమ్మవు- లాభంలేదు.

మం॥ చెపుదూ.

సుం॥ నువ్వు పసిదానివి. లోకమూ, దాని అసహనమూ దాని వంకరదృష్టీ తెలీనిదానివి, అమాయకురాలివి.

మం॥ అందుకనే అట్లు మోసపోయినాను.

సుం॥ నన్ను నమ్మవొచ్చావు. అటువంటి నిష్కపటురాలిని- నిన్ను- నా స్వలాభంచూసుకుని 'ఎన్కరేజ్' (Encourage) చేసి, నాతో వుంచుకుంటే పర్యవసానమేమవుతుంది? వుండు.

నువ్వనేది నాకు తెలుసు. అది నిజమే. నేనేమీ యోగిని కాదు. అసాధారణ సహనవంతుణ్ణీకాదు. నిన్ను పెట్టుకున్నాననగానే మా తండ్రి డబ్బు పంపడు- నాకు భయమే- మావాళ్లూ, మీవాళ్లూ మనని రాసీరు. బీదతనం, అమర్యాద, సంఘదౌర్జన్యం, ఆజన్మాంతమూ హీనత్వం, లేచిపోయిందని హేళన- మనపిల్లలకి తలవొంపులు- ఇన్నీ ఆలోచించాను. నాకప్పుడే తెలుసు- స్త్రీ హృదయం కదలనే కదలదు. కదిలిందా అది జగన్నాథుడి రథమేనని. ఎవరికేం ముప్పుమూడుతుందో, తాముగాని యితరులుగాని తమ ప్రవర్తనవల్ల యెంత నలుగుతారో, యేమీ ఆలోచించదు. బంధనాలకూ. వివేకానికీ అంధమౌతుంది. కాని పురుషుడికైనా కలగవొద్దా జ్ఞానము-

మం॥ నిజమేనా! నమ్మనా?

సుం॥ నీయిష్టం.

మం॥ కాని, తరవాత,......తరవాత...నా శిశువు నా గర్భంలో కదిలినప్పుడు, నేను నీకు రాసిన వుత్తరాలు-

సుం॥ అవును. యేంచెయ్యనూ......చేశాను. మహాపాపం చేశాను. ఏనాడు నీలోతైన రొమ్ము వేపు నా మనసు చలించిందో ఆనాడే పరిగెత్తుకుపోవలసింది. ఏనాడు నాచూపులు నీమెడచుట్టూ తిరిగాయో, ఆనాడే కళ్ళుపొడుచుకోవలసింది. కాని నీ సామీప్యాన నేనుపొందే మాధుర్యం నన్ను అశక్తుణ్ణి చేసింది-

మ॥ మరి నాసంగతీ-

సు॥ నీవెంత దురదృష్టంలోనడ్డా, నాతో నిన్నీడ్చే అవ స్తకన్న నయమేగా! అదిగాక పెళ్ళైనవాణ్ణి, యింకోవ్య క్తి బాధ్యత నాచేతులపై నవుంది. నే నేంచెయ్యగలను.

మం॥ నీ అంతరాత్మకి యీా కారణాలుచెప్పి, నోరుమూసి, ధర్మమే ఆచరించాననీ సంతోషించావు. అవునా?...... నాబాధ, నాబాధ?

సు॥ ఆబాధ నా నెత్తిన రుద్దుతావేం? నీ ప్రారబ్ధం అనుభవించ కేం చేస్తావు?

మం॥ (కోపంతో) ప్రారబ్ధమా! నీ గొంతుపూడిపోనూ! అమా యకురాల్ని నన్ను తప్పుతోవలకీడ్చి, శిశువుని కల్పించి, నన్ను నాగతికివొదిలి, నీ భార్యతో సుఖించడం నా ప్రారబ్ధ ఫలమా? ప్రతి రాత్రి శూన్యంతో, నీకోసం చేతులు జాచి, జాచి– యేడ్చి, గర్భంలో శిశువు కదిలినప్పుడల్లా, ఆ ఆనందం జ్వాలవలె నన్ను కాలుస్తోవుంటే ఆ దొంగతనమూ, సిగ్గూ, భయమూ- అబ్బో- దాన్ని- ఆ నోరులేనిదాన్ని తిట్టుకుంటూ యెన్ని జన్మాలకైనా మరవగలనా? అదంతా నా పూర్వ జన్మఫలమా? ధూర్తుడా, పిశాచీ, సిగ్గులేదూ, నీమొహా నికి!...... ఎంత నమ్మాను నిన్ను! ఎన్నిసార్లు ప్రయత్నిం చాను, ఎట్లాగో తప్పించుకుని నీదగ్గిరికివొచ్చి, నీ గుండెల మీాద అర్థరాత్రి కూచుని, కత్తితో, నీ కళ్ళు తెరిచి, గుడ్లు పెరికి, మాట్లాడకుండా నీ నాలికకోసి, నన్ను కావిలించుకున్న నీ చేతులు నరికి "నేనే! నేనే! అంత సులభంగా మోస పుచ్చి వొదిలిన దిక్కుమాలిన పిల్లని- నేనే– నోరులేని ఆడ

పిల్లకదా, అని వొదిలేస్తే, వొదిలిందనుకున్నావా? నేనే, పిశాచిని, రాకుసిలి నేనే" అని–

సుం॥ తిట్టు, వుమ్మెయ్యి- పాపంచేశాను. కాని నేను కరుణ తలచక నిన్ను వుపేక్షచేసినందువల్లనేకద- యీ భాగ్యము- కొడుకు కోడలు- యిన్నీ యేర్పడి సౌఖ్యపడుతున్నావు! నేనే నిన్ను తెచ్చుకుంటే- మనిద్దరి గతీ యేమయ్యేది?

మం॥ ఇప్పుడు సరే! చేసినపని మంచిగా వుండవొచ్చు, పర్యవసానంవల్ల. కాని అప్పుడూ యివన్నీ ఆలోచించేనా, నా విచారానికి నన్ను వొదిలిపెట్టి రాయివలె వూరుకున్నావు? చెప్పు, నివ్వెట్లా నిర్దోషివి?

సుం॥ వూరికే మానినపుళ్ళు రేపుకుని యేమిప్రయోజనం?

మం॥ లోపల తాకుళ్ళు, బైటపెట్టడం భయం. నిజంచెప్పు. ఇన్నేళ్ళొచ్చాయి. ఇప్పటికైనా నిజం మాట్టాడితేనేం?

సుం॥ (ఆలోచించి) నిజంచెపితేనేం? నీ వుత్తరాలుచూసి, మనసు నిలవక, నిన్ను తెచ్చుకుందామనుకున్నాను. కాని భార్య వొప్పుకోలేదు. చస్తానంది. పుట్టింటికిపోయి గోలచేస్తానంది. మరి దాని ఆ స్త్రిమీాద బతుకుతోవుంటిని!

(సిగ్గుతో తలవొంచుకున్నాడు.)

మం॥ అదే నిజం! నీ భార్యకి దడిశి నన్నెట్లో వొదిలావు.

సుం॥ నా భార్యనిచూసి యీార్ష్యపడుతున్నావెందుకు?

మం॥ ఈర్ష్యా! నీకేంమతిపోతోందా? ఈర్ష్యకాదు. నా విధ్యుక్తమునుంచి భార్యనిచూసి భయపడ్డ నిన్నుచూసి అసహ్యాం.

సుం॥ విధ్యుక్తమా ? నా భార్యనీ, సంసారాన్నీ పాలించడమా-కడుపుతున్న వితంతువుని తెచ్చుకుని సంసార విచ్ఛేదనం చేసుకోడమా ? అగ్నిసాక్షిగా చేసిన ప్రమాణాలను ధ్వంసం చేసి—

మం॥ అవును. పంచభూతసాక్షిగా చేసిన ప్రమాణాలేమైనాయో ! ఇది బహిరంగమూ, అతిరహస్యమూ ! అంతే బేధం- ఛీ ! నీతో మాట్లాడడం పాపం.

సుం॥ నా కాపరాన్ని నేను నాశనంచేసుకోని పాపానికి, నా కూతురు సంసారం నాశనం చెయ్యాలంటావు అంతేనా ? సుఖంగా యిట్లా బతకడం నీకేం చేదుగావుందా ? (కంఠం మార్చి) మునుపూ యింతే - ఏదో వొంకపెట్టి నాతో తగాదాపెట్టుకుని కన్నీళ్లు కారిస్తేనేకాని తృప్తి—

మం॥ మరినువ్వు వోదార్చడం యెంతబావుండేది ! పకపకానవ్వి, నా మాటల్ని తప్పించి, దొంగపలుకులు పలికి యిట్లానే-యెప్పుడూ మోసపోవడమే నేను !

సుం॥ ఏంమోసపోయినావు ? హాయిగా యిల్లూ వాకిలీ, బంధువులూ, నౌకర్లూ—

మం॥ కాని శాంతియేదీ ? నా గర్భంలో అగ్ని-

సుం॥ ఎందుకు ?

మం॥ ఆ మూడురాత్రుల పాపాగ్ని నిన్ను వొదిలిందిగాని, నన్ను జన్మాంతమూ పట్టుకుంది.

సుం॥ అంటే ?

మం॥ మనకొడుకు.

సుం॥ కొడుకూ !

మం॥ అవును- ఓ పల్లెటూళ్లో యెవరికీ తెలీకండా కానిచ్చే యేర్పాటుచేశారు. అక్కడ, ఆ గుడిశలో కని (కన్నీళ్ళతో) పాలు తాగుతున్న పిల్లని, నామేడమీద చిన్నచేతుల్తో, తడుముతున్నకూనని, లాగి, విడతీసి, యిచ్చేశాను- చాకలి వాళ్లకి- పెంచుకోమని (కోపంతో) సంతోషించు. కడుపు నిండిందా ?

సుం॥ తరవాత-

మం॥ ఎంత బతిమాలుకున్నా, వుపవాసాలుచేసి, చస్తానని బెదిరించినా, నా బిడ్డని నేను తెచ్చుకోడానికి- ఒక్కసారి చూసి రావడానికి వొప్పుకోలేదు. మావాళ్ళు- నా ప్రియమైన తలిదండ్రులు వాళ్ల మర్యాదవుంటేసరి ! నా గర్భంకాలి నేను చ|స్తే వాళ్ల కేం !

సుం॥ మళ్లీ తలితండ్రులకి కృతజ్ఞతచూపాలని నీతి పుస్తకాలన్నీ బోధిస్తాయి.

మం॥ వాళ్లుమాత్రం- ఏంచేస్తారు పాపం, వాళ్లకీ-

సుం॥ (హడిలిపోయి) వుండు ఆ, ఆ, వుండు......నిజమే ! అవును- అదే యీడు...ఆ, ఆ, అన్నకీ, చెల్లికీ పెళ్లి చేశామూ ! శివ, శివా ! ఎంత ఘోరపాపమిది! పోనీ, నన్ను తీసుకుపోనీ, దాన్ని కామాక్షిని. ఇంకా నయం, రాత్రికాక ముందే వొచ్చాను- ఎంత-

మం॥ వుండు. గోలపడకు. ఈ వెంకటచలంకాదు.

సుం॥ కాదుకద ! అమ్మా! ఐతే నువ్వు తెచ్చుకోనేలేదన్న మాట! ఎక్కడవున్నాడు !

మం॥ ఎట్లాచెప్పను ? నా చిన్నిపాపని ఆ చాకలాళ్ళు ఏంకొడుతున్నారో, ఆకలి అని గొంతుచించుకున్నా పాలు పోస్తున్నారో లేదో- పరాయిపిల్ల వాళ్ళకేంముద్దు ! ఏం రోగంవొచ్చి, ఏంబాధపడుతోందో- అని ఆలోచించుకుని, ప్రతి రాత్రి, చీకట్లో చేతులుజాచి, జాచి చచ్చాను. ఎన్నాళ్ళకీ మరుపు రాదు. ఎన్నటికీ చల్లారదు మంట. ఏదన్నా పనివుంటే మరవగలంగాని దుఃఖం- వూరికే తిని కూచున్నవాళ్ల కదే పని ! కడుపంతా మండేది. గిలగిలతన్నుకునేదాన్ని— మళ్ళీ పిల్లల్ని కన్నకడుపే అమ్మది— వూరికే తిట్టేది నన్ను - పన్నెండేళ్లు ఎండబెట్టుకున్నాను హృదయాన్ని, కాల్చే విరహాన్నికి వొదిలేశాను గర్భాన్ని. స్వేచ్ఛలాగానే, మొగుణ్ణి గురించి ప్రతిదినమూ కలలుకని, రూపాన్ని వర్ణించుకుని, చిత్రించుకుని, బాధపడుతున్నానో, వాణ్ణి నౌకరుకింద తెప్పించుకున్నాను. కాని నేను వొదిలిన పసిపాపకీ, వీడికీ సంబంధ మేదీ ! వీడు వొచ్చినా నా పాపయెక్కడో యేడుస్తున్నట్టే వుండేది. సరిగా పాలుపడుతున్నారా, కొడుతున్నారా, అని వులికిపడి లేచేదాన్ని ! యెట్లాగో సమాధానం పెట్టుకుని ప్రేమించడం నేర్చుకున్నాను యీ నౌకరు కుర్రాణ్ణి.

సుం॥ వున్నాడా, యిక్కడ !

మం॥ అప్పటినించీ, నాబాధ ప్రారంభం.

సుం॥ యేం ?

మం॥ నాకోఅబ్బాయి నదివరకే పెంపకంచేశారు, యీ వెంకటచలాన్ని. వొచ్చినరోజునించీ వీడికీ వాడికీ విరోధం. ఆవెంకటచలం మేధకత్వం పురస్కరించుకుని వీడుచేసిన దుండగం

అంతా, యింతానా! నే నేమీ అనలేను. నా బిడ్డకి జరిగిన అన్యాయం నా కళ్లకి కట్టినట్టు కనపడి, కొట్టబోయ్యే నా చెయ్యి ఆగేది. నాకొడుకు నౌకరువాడిమల్లే తిట్టుతింటే, యెంత వేదన కలిగేది! బంధువులూ నౌకర్లూ వీణ్ణికొడితే వాళ్లని చంపెయ్యాలనిపించేది. ఏంచెయ్యను? వీడేడిస్తే వాడి పౌరుషమూ, కళ్లల్లో అధికారమూ వెలిగితే, వెళ్లి కావిలించుకోవాలని, నా శరీరమంతా లాక్కు-పొయ్యేది. యెంత ప్రియత్నించినా నా కొడుకు, నా సంపదకంతా ప్రభువు లాగూ, ఆ వెంకటచలం అన్యాయంగా, అక్రమంగా ఆక్ర మించుకున్నట్టూ తోచేది. నిన్ను తలుచుకుని వాణ్ణెంత ద్వేషిద్దామన్నా నాచాతనయ్యేదికాదు. వాడు నవ్వినా, తలతిప్పినా, నువ్వే, నీ అందమే జ్ఞాపకం వొచ్చేది. నీమీది ద్వేషమంతా వాడిమీది ప్రేమలో కరిగిపోయింది.

సుం॥ కరిగిపోయిందా?

మం॥ వెల్లి విరిసి ప్రేమ వొచ్చేది. చూపలేను, కన్నీళ్లు తుడ వాలని, నీళ్లు పొయ్యాలని, కావిలించుకోవా లనిపించేది. యెట్లా? యెవరు ప్రేమించేవారులేక, నౌకరై, సహజ అహం భావంలో ప్రతివారిమీదా, ఆజ్ఞలమీదా నామీదా తిరగ పడేవాడి స్థితిచూసి......అబ్బా, యేం బాధపడేదాన్ని? రాత్రులుపోయి, చాపమీద దొర్లే వాడిపక్కన పడుకుని, తెల్లవార్లూ కావిలించుకోవా లనిపించేది. వ్రూరికే చూస్తో రాత్రంతా నుంచునేదాన్ని. చాటుగా తినేవన్నీ పెట్టాను. చాటుగా ముద్దు చేశాను. కాని నా రహస్య ప్రేమ వాడికి విషంగా పరిణమించింది. అన్నీ దొంగబుద్ధులు:

తిరగపడడం. పొగరుబోతుతనం! వాడుచేసే పాడుపనులు ఎన్నని చెప్పను. యెట్లా చెప్పను? నాగర్భం అట్లా తగల పడి పోతోవుంటే నేనెట్లా వోర్వను? ఒక్కరోజు శాంతి నెరగను. యింతకంటె నన్ను మీరు మీతో తీసుకుపోతేనే బాగుండేదేమో!

(పరుగెత్తుకుంటో నీరదా, వసంతం వొచ్చారు.)

నీ॥ అమ్మమ్మా, అమ్మమ్మా! రా, చూడు, ఆగది యెంత అందంగా చేశారో!

వ॥ దాంట్లో హల్వా నాకు కొంచమన్నా యియ్యలేదు. అంత నాన్నకీ పిన్నికీట! కొంచం యిప్పించవూ, అమ్మమ్మా!

మం॥ అవి మనం తాకకూడదు. యింట్లో చోకలెట్లు పెడతా రండి.

నీ॥ అమ్మ యిచ్చింది. యెన్ని! నా పెట్టెనిండా పోసింది.

వ॥ నీరదా, అమ్మ యేమంది?

మం॥ యేమంది?

నీ॥ యేం లేదు. యేడుస్తోంది.

వ॥ యేడుస్తోందని చెప్పవొద్దన్లేదూ అమ్మ!

మం॥ యేడుస్తోందా? యేడవనీ, అమ్మకి శాస్తికావలసిందే!

(యింకా యేదోఅనబోయి ఆలోచించి వూరుకుంది)

నీ॥ అమ్మవన్నీ దొంగయేడుపులుకదూ, అమ్మమ్మా!

మం॥ ఊ!

వ॥ అమ్మ, పాపాత్మురాలు. పెద్దవాళ్లు చెప్పినమాట వినదు.

మం॥ వూరుకో, అమ్మని అనడం తప్పుకదూ?

వ॥ తప్పా అమ్మమ్మా! అమ్మని అనడమూ తప్పేనా?

మం॥ పిన్ని నాన్నగారు వొచ్చారు చూశారా? తాతయ్యగారు నమస్కారం చెయ్యండి.

(నమస్కారం చేశారు.)

సుం॥ యెంతచక్కని పిల్లలో! యింకేం కావాలి యీ తోటని స్వర్గతుల్యం చెయ్యడానికి!

వ॥ (సుందరేశయ్యతో) పిన్ని మంచిది. మాకు అన్నీ యిస్తుంది. అందుకునే మా నాన్న యెప్పుడూ ముద్దుపెట్టు కుంటాడు.

మం॥ యింటోకిరండి. యింతసేపు మిమ్మన్ని అలసటపెట్టాను. మంచి ఆతిథ్యమే! చక్కని వియ్యపరాల్ని దొరికాను.

(కామక్షి యింకోరకం ముస్తాబైవొచ్చింది. సుందరేశయ్య ఆమెని కావిలించుకున్నాడు.)

కా॥ నాన్నా, యింకా యిక్కడ వున్నావేం!

సుం॥ ఏం?

కా॥ అంత హీనంగా చూశాక యింకా నువ్వెందు కిక్కడ! నావిధి నేనుంటాను. నువ్వెళ్లు.

మం॥ అంత కోపమా! ముసలిదాన్ని నన్ను క్షమించవా?

సుం॥ రాత్రికి చెప్తాలే అంతా, కామక్షీ!

(మంగమ్మా సుందరేశయ్యా వెడుతున్నారు. నారాయణ పాడుతో వొచ్చాడు.)

నా॥ కులానగుంటాది నాయెంకి
కులుకుసూ పెడతాతి నాయెంకి
ఆ ముసలినక్కేన నిన్నుకన్నాది?

కా॥ పో, వెధవా, మా నాన్న నేమన్నా అన్నావా?

నా॥ మేళంలో మద్దెలవాడిమల్లే అదేం వేషం!

కా॥ అత్తగారూ, వీడు చూడండి.

(మంగమ్మ, సుందరేశయ్యా తిరిగి వొచ్చారు)

నా॥ ఓరి ముసలినక్కా !

సుం॥ ముసలినిరా! చూద్దుగానిరా, రారా.

(మీదికి వెడుతున్నాడు. ఆయన జబ్బలుచూసి నారాయణ వెనక్కి తగ్గుతున్నాడు)

కా॥ పోనీ నాన్నా, పిరికివెధవ.

సుం॥ యెవడు వీడు ?

మం॥ మాయింటో వుంటాడులెండి.

సుం॥ ఒక్కతడాఖా చూపిస్తాను.

కా॥ వీడసలు నౌకరుట నాన్నా !

(సుందరేశయ్య చప్పున వెనక్కితగ్గి చూస్తున్నాడు. మంగమ్మ మొహం తిప్పుకుంది)

సుం॥ యేమిటయ్యా, యీదౌర్జన్యం? పెద్దవాళ్లని గౌరవిస్తే పాపమా? వొచ్చిన నిమషానే నిష్కారణంగా తగాదా పెట్టుకున్నావు. ఈ పిల్లని స్నేహం చేసిందని అట్లా యేడిపించడం? నీకు చెల్లెలుకాదూ! అన్యాయం, అన్యాయం!

నా॥ నాచెల్లెలూ (నవ్వుతున్నాడు) ఓసే, అరవోడా, నీకూ నీకూతురికీ—

మం॥ నోరుముయ్యి. పో, అవతలికి.

నా॥ వీళ్లందరూ, యెందుకు బంగాళాలో—

మం॥ నోరుముయ్యి, వెళ్ళుముందు.

(నారాయణ వెడుతున్నాడు.)

సీ॥ యింతమంచి తాతయ్యని తిడుతున్నాడయ్యా, యీ నారాయణ. అసలు మన యింటోంచి పంపెయ్యి.

వ॥ తాతయ్యా, వొదలకు. వాణ్ణికొట్టి బాగా, వాడి కండువా పూర్తిగా చింపెయ్యి.

సుం॥ యెందుకు వాడికంత—

వ॥ నారాయణకిమల్లే తాతయ్యకికూడా యెర్రిమిాసాలే.

నీ॥ తాతయ్యా, మాకేమన్నా తినడానికి తెచ్చావా?

మం॥ అట్లా అడగవొచ్చా.

వ॥ తాతయ్య టర్రింకు చూశాను. యేం లేవు. చుట్టలకంపు.

(మంగమ్మా, సుందరేశయ్యా, కామాక్షీ నడుస్తున్నారు)

నీ॥ తమ్ముడూ, యిదిగో నేలపిల్లి.

వ॥ యేదీ, యేది!

(పెద్దవాళ్లు వెళ్లారు, పిల్లలు పిల్లులకోసం సేలలో వెతుకుతున్నారు.)

నీ॥ వుమ్మెయ్యి, వుమ్మెయ్యి, పైకివొస్తుంది.

(లక్ష్మి వొచ్చింది.)

ల॥ పిల్లులా, నేను తీసిపెడతాను.

వ॥ లక్ష్మి, యేమిటి తింటున్నావు?

ల॥ సీమచింతకాయలు.

వ॥ నాకో.

(యిస్తోంది.)

నీ॥ పాపం! దానికాయలు తీసుకోకు, తమ్ముడూ! మనముయెన్ని అప్పచ్చులు తిన్నాముకాము యీవాళ!

ల॥ యింతవరకు మాకు బువ్వపెట్టలేదు. పొద్దుణ్ణించి గంజే లేదు.........యిదుగోపిల్లి యిందండి.

వ॥ యేం?

ల॥ బాబూ, అక్కా— తగూలాడుకున్నారు.

నీ॥ యెందుకు?

ల॥ అమ్మగారు అక్కని వెళ్లగొట్టమన్నారు. యెక్కడికి పోనని అక్కయేడుస్తోంది.

నీ॥ మా అమ్మ యేడుస్తోంది.

ల॥ యేం?

వ॥ మీ అక్క యెందు కేడుస్తోంది?

ల॥ అమ్మగారు పొమ్మన్నారుగా!

వ॥ యెందుకు?

ల॥ అక్కకి కడుపొచ్చింది.

నీ॥ పాపాయి పుడుతుంది. దాన్ని నాకియ్యాలి.

ల॥ అక్కకి పెళ్ళికాలేదుగా?

నీ॥ ఓ!

వ॥ మరి యెందుకు పెళ్ళిచెయ్యలేదూ.

ల॥ చెయ్యకపోతే, మరి కడుపు తెప్పించుకోవొచ్చా?

వ॥ యెందుకు తెప్పించుకుందో!

నీ॥ పాపాయికోసం.

(విమల వొచ్చిది)

వి॥ బాబూ, యిట్లారా.

వ॥ వుండు. యీ పిల్లిరావటంలేదు.

వి॥ నేను వెళ్ళిపోతున్నా, ఒక్కసారిరావూ?

(వొచ్చాడు)

వ॥ యెక్కడికి అమ్మా?

వి॥ యెక్కడికో చాలాదూరం.

వ॥ మళ్ళీ యెప్పుడొస్తావు?

వి॥ యెన్నో యేళ్ళకి యెప్పుడో! నన్ను గుర్తున్నావట్టవు, అప్పుడు.
నీ॥ మల్లీ చామంతిపువ్వులొస్తాయా, అప్పుడు?
వి॥ కాదు. యింకా చాలాయేళ్లకి చూడండి. అమ్మమ్మ మీతో నేను చెడ్డదాన్నని చెప్పిందికదూ? అవునా?

(వూరుకున్నారు.)

నేనేం చెడ్డదాన్ని కానమ్మా! నాకే- మీమీద చాలా ప్రేమ. నేనే- తొమ్మిదినెలలు పొట్టలో మోసి కష్టపడి కన్నాను.
నీ॥ మన ఆవులాగు కదూ?
వి॥ కన్నాను. యెంతో కష్టపడి కన్నాను.
నీ॥ అవును. వసంతుని కన్నప్పుడు ఆ మూలగదిలో మూలిగావు. నేనేడ్చాను.
వి॥ అవును. నిన్నూ అట్లానే కన్నాను. అప్పుడు చచ్చిపోతానని కూడా అనుకున్నాను. తరవాత మిమ్మన్ని యెంతో కష్టపడి పెంచుకున్నాను.
వ॥ అమ్మమ్మకదూ మన్ని పెంచింది. అక్కా?
వి॥ అమ్మమ్మకి డబ్బువుంది. కనక మీకు అన్నీ కొనిపెడుతుంది. నాకు డబ్బులేదు. నాకే డబ్బువుంటేనా అమ్మమ్మల్లే దాచుకునేదాన్నా! ప్రతి దమ్మిడీ మీకే యిచ్చేదాన్ని
వ॥ దమ్మిడీతేనా?
నీ॥ నీకు డబ్బెందుకు లేదూ?
వ॥ డబ్బులేకపోతే యెందుకేం?
వి॥ పోనీ, నీకు తేలుకుట్టిన రాత్రి తెల్లార్లూ నేను కూచున్నానా, అమ్మమ్మా! అమ్మమ్మని మీరుకొడితే వూరుకుంటుందా? నన్ను కరుస్తావా! నే నేమన్నా అంటానా?

నీ॥ (విమల మెడ కావిలించుకుని) అమ్మ మంచిది, తమ్ముడూ! యెక్కడికీ వెళ్లక అమ్మా.

వి॥ నన్నే- చెడ్డదాన్ని అనుకోకండి. అమ్మమ్మ వూరికే అట్లా చెప్తుంది. నామీద కోపం. ఆ మాటలు నమ్మకండి. నా ప్రాణాలన్నీ మీమీదనే వుంటాయి- (పిల్లల్ని ముద్దు పెట్టుకుంటోంది.) చిన్నప్పటి సంగతులేమీ జ్ఞాపకం లేవూ: నామీద యెంత ప్రేమగా వుండేవారు! యెట్లా ఆడుకునే వాళ్లం! ఆవాళ, గడ్డివాము తగలపడ్డ రాత్రి, బొమ్మరిల్లు కట్టుకుని యెట్లా దాక్కున్నాము. అమ్మమ్మ కొట్టవస్తే నా వెనకాలేకాదూ దాక్కునేవారు. (సగం తనలో) నిర్భాగ్యు రాల్ని మిమ్మన్ని కాపాడుకునే శక్తివుంటే నామీద ప్రేమ పొయ్యేదేకాదు మీకు! భయపడి, దిక్కులేక, చేతులారా, మిమ్మల్ని మీ పేమినీ ఆ రాక్షసి చేతికండిచ్చుకున్నాను. నేనెవ్వరికీ అక్కర్లేదిప్పుడు.

నీ॥ కావాలి అమ్మా- నువ్వు నాక్కావాలి.

వి॥ యెందుకు?

నీ॥ యెందుకా, వుండు...వుండు...

వి॥ నీకేమీ తెలీదు, అవునా?......అంతే నాగతి...... నాకు పాపియశ్చిత్తము. నా పిరికి పాపానికి.

నీ॥ వుండు అమ్మా! మాకోసం వుండు.

వి॥ నేను వెళ్ళిపోవడంకూడా మీ కోసమే!

నీ॥ మా కోసమా! మేమిక్కడే వున్నాముగా!

వి॥ (సగం తనలో) నేనిప్పుడు మీకేం వుపయోగం? వుండీవొకటే, లేకా వొకటే! యెన్నటికి మీపేమికి అర్హురాల్ని కాగలను?

వ్వారికే తొమ్మిది నెలలుమోసి కన్నందుకు, వొస్తుందా మీ దగ్గర్నించి ప్రేమ! యే మృగమన్నా చేస్తుం దాపని. శక్తిలేనిదానిమీద భక్తి ఎట్లావొస్తుంది? డబ్బు సంపాయించి మీకు ఎన్నో వొస్తువులు పట్టుకొస్తా. నన్ను మరిచిపోకండి.

(లక్ష్మియేడుస్తూ విమల దగ్గిరికి వొచ్చింది.)

ల॥ నన్ను తీసికెళ్ళండి, అమ్మా! నేను వొస్తాను మీతో.

వి॥ (ఆశ్చర్యంతో) నువ్వా!

ల॥ నేను మీకు పనిచేసి పెడతాను. స్నేహంగావుంటాను. ప్రేమిస్తాను. నన్ను తీసికెళ్లండి.

వి॥ యెందుకే నువ్వు నాతో?

ల॥ వొస్తానమ్మా!

వి॥ మీ అయ్య కొట్టడా?

ల॥ అదికాదమ్మా, మీరొక్కరు వెళ్లవొద్దు. ఆవెధవ నారాయణ మిమ్మల్ని బాధలు పెట్టాడు. నేను చూశాను. తీసికెళ్లండి నన్ను.

వి॥ (దాన్ని ముద్దుపెట్టుకుని) వొద్దమ్మా! నాకే గతిలేదు. నిన్నేంచేసుకోను (వెళ్ళింది.)

నీ॥ పాపం! అమ్మ వెళ్లిపోతోంది.

వ॥ అన్నీ వుత్తదే! వెళ్లదు నీరదా! యెక్కడికి వెడుతుంది?

నీ॥ లక్ష్మీ! యెందుకేడుస్తున్నావు?

ల॥ కడుపు పీక్కుపోతోంది. బువ్వలేదు.

నీ॥ వుండు, యిక్కడే వుండు

(నీరద లోపలికి వెళ్లింది)

ల॥ మీ అమ్మగారు అట్లాయేడ్చి వెళ్ళిపోతూవుంటే, అట్లా వూరికే నుంచున్నారేం ?

వ॥ అంతా దొంగవేషం.

(నీరద పలహారాలు తెచ్చి లక్ష్మికి యిచ్చింది. లక్ష్మి తింటోంది)

ల॥ చల్లని చిన్నమ్మగారు ! మీకు పుణ్యముమ్మా ! విమలమ్మ గారికి బువ్వలేకపోతే, యెవరో యిట్లానే పెడతారు.

నీ॥ అమ్మకి అన్నం యెందుకు వుండదు ?

ల॥ యెట్లా వొస్తుంది ?

నీ॥ అవును. పాపం, అమ్మ యేమౌతుంది ! అన్నంలేక చచ్చి పోతుందేమో !

(మంగమ్మ వొచ్చింది.)

మం॥ యివన్నీ తీసుకొస్తోవుంటే యెందుకో అనుకున్నాను. దీనికి పెడుతున్నారా ? ఓసీ, చిన్నపిల్లల్ని చేసి బెల్లించుకుతింటు న్నావా ? మిమ్మన్ని దీంతో సావాసం చెయ్యవొద్దన లేదూ ? యీ నీచుల - (ఆగి ఆలోచిస్తోంది.)

నీ॥ లచ్చికి ఆకలివేసింది

మం॥ లచ్చికి ఆకలివేస్తే, నిన్ను యింటోవన్నీ తెచ్చిపెట్టమ న్నారా ? అవి నీవా ?

నీ॥ నాకిచ్చారుగా !

మం॥ నిన్ను తినమన్నారుగాని పంచిపెట్టమన్నారా ? ఆ చోకలె క్కెక్కడివి ?

నీ॥ అమ్మ యిచ్చింది.

మం॥ అమ్మకెక్కడివి ?

నీ॥ అమ్మవే !

మం॥ అమ్మనే, అమ్మవీ, నీవీ -

నీ॥ అమ్మ మంచిది. అమ్మమ్మ! నువ్వన్ని అబద్ధాలు చెప్పావు.

మం॥ ఆ, అంతవరకొచ్చిందీ! అదేనా చెప్పింది, మీ అమ్మేనా (తగ్గి పస్తాయించి) అవును. అమ్మమంచిదే! (తనలో)మంచి దేనేమో! యేమో! యెవరికి తెలుసు? యెవరనగలరు?

నీ॥ చాలా మంచిది.

మం॥ (దయగా) లచ్చీ, యెందుకే ఆకలి?

ల॥ మా యింటో గంజి కాచలా.

మం॥ యేం? యేదో వెధవతగూ మళ్ళీ పెట్టుకున్నారుగావును. నాయన తాగాడా?

ల॥ లేదు. అక్కని యింటోంచి పొమ్మన్నాడు. అక్కయేడ్చింది. కొట్టాడు. మీరు అక్కని పొమ్మన్నారుటగా?

మం॥ (ఆలోచిస్తో) అవును, పొమ్మన్నాను- పోసీ వుండమను. (సగంతనలో) నేనెవర్ని పొమ్మనడానికి!

నీ॥ పొమ్మను, అమ్మమ్మా, మన యిల్లు.

మం॥ అందరం అట్లాంటివాళ్లమే నమ్మా.

వ॥ కాదు. వాళ్లు చెడ్డవాళ్లు, లేకివాళ్లు, బుద్ధిలేదు ఆ శూద్రా ళ్లకి. పొమ్మను.

నీ॥ మనకి పనెవరు చేస్తారు?

వ॥ బైటవుండి పనిచెయ్యమను.

మం॥ లక్ష్మి, ఆకలేసిందా? వెళ్ళు. వెంకమ్మని పెట్టమన్నానని చెప్పు (వెడుతోంది ఆలోచిస్తో.)

నీ॥ అమ్మమ్మ, లక్ష్మిమీద యింతదయగావుందే యీవాళ!

వ॥ ఆ లక్ష్మ యిచ్చినందుకు, నిన్ను గదిలో పెట్టడం మరిచి పోయింది.

నీ॥ సరేలే. ఆ పిల్లిని అగ్గిపెట్టెలో పెట్టు.



# మంగమ్మ

2

(రాత్రి తొమ్మిదిన్నర. వెనక గది - ముందు చెట్లు- గదికి తలుపూ, కిటికీ- తలుపుమూసివుంది. కిటికీ తెరిచివుంది. లోపల దీపం వెలుతురు. కిటికీ వెలుతురుకింద, గదిబైట, సోఫామీద వెంకటచలం కామాక్షీ కూచుని వున్నారు.)

కా॥ రాత్రి తక్కిన పిల్లలందరూ పడుకున్నతరవాత ఒక్కత్తెనీ 'బాల్కనీ' లో నుంచిని ఆలోచించుకునేదాన్ని, యీ రాత్రిని గురించి.

వెం॥ యేదన్నా రూపం కళ్లముందు వుండేదా ?

కా॥ ఆ రూపమెప్పుడూ మారేది. ఆవాళచూసిన మంచి రూప మేదో అది కనపడేది.

వెం॥ (బుగ్గ గిల్లుతో) అంత చంచలమే !

కా॥ యింక చలించదు.

వెం॥ యేమో !

కా॥ నన్నట్లా అనవొద్దు. నవ్వులాటకైనా వొద్దు.

వెం॥ సరే !

కా॥ నాకు నిద్రొస్తోంది.

వెం॥ అప్పుడే ?

కా॥ కూచుని యేంచేద్దాం ?

వెం॥ మాట్లాడుకుందాం.

కా॥ యేంమాటలు? మాటలేమిటి? వూరికే మాట్లాడితే యేం బావుంటుంది!

వెం॥ నీ నోటినించి వొస్తోవుంటే, నీకళ్ల కదిలకనీ, నీ పెదిమల తొందరనీ, నీ మెడవొంపునీ చూడ్డం బావుంది.

కా॥ బొమ్మని చూసినట్టు!

వెం॥ అంటే?

కా॥ చేతి దూరాన వుంచి—

వెం॥ ఛా! యేమిటంటే, యింకా నాకేదో నువ్వు కొత్తదానివి మల్లేనే వున్నావు. నీ స్వేచ్ఛా, సిగ్గులేకపోవడమూ,- ఎవరో ఆడటీచరుతో— కాదు, యేలోకంనించో నాతో ఒక గంట మాట్లాడ్డానికివొచ్చిన కిన్నెర కన్యవేమో అనుకుంటున్నాను:

కా॥ ఏమిటి నావల్ల మీకు వుపయోగం?

వెం॥ ఇట్లా కనపడ్డమే! యిట్లా కూచోడమే! ఎందుకూ యింకా సందేహిస్తో అట్లా వోరగా నా ముఖం చూస్తావు? నేను విశ్వాసపాత్రుణ్ణిగా కనపట్టంలేదా?

కా॥ నాకేమీ సందేహంలేదు, మీమీద. నన్ను నమ్మండి. రండీ, యిట్లా దగ్గిరిగా, రండి. వూరికే మాట్లాడుకుంటో కూచుంటే యిట్లాంటి సందేహాలే తోస్తాయి.

(వెంకటచలం ఆమె దగ్గిరిగా కూచుని ఆమె మొహం చేత్తో పట్టుకు చూస్తున్నాడు.)

కా॥ యేం కనపడుతోంది?

వెం॥ మాధుర్యం!

కా॥ వొలికిపోతోంది (నవ్వుతోంది)

వెం॥ అబ్బా, యీ ఆనందం! ఆ బుగ్గలమీద ఆ చిన్ని సొట్ట లెక్కడ సంపాయించావు?

(ముద్దెట్టుకుంటున్నాడు.)

కా॥ బావున్నాయా?

వెం॥ అడుగుతావా? ఎందుకు అడుగుతావు?

కా॥ ఏంలేదు. మీ కళ్ళకి బావున్నాయో, లేదో అని.

వెం॥ ఎవరికళ్ళకి బావుండవు?

కా॥ కొందరి - కొందరికి.

వెం॥ నీకెట్లా తెలుసు?

కా॥ చెపితే!

వెం॥ ముద్దుపెట్టుకునే!

కా॥ ఛీ!

(అతని చంపమీద కొట్టింది.)

వెం॥ మళ్ళీ నవ్వు.

కా॥ నవ్వను.

వెం॥ నవ్వించనా?

(చక్కలిగింత పెడుతున్నాడు.)

కా॥ వుండండి.

వెం॥ అబ్బా, నిన్నేంచేసుకోను! ఇందంతా నాదే!

కా॥ మీదే! ఎవరన్నా ఎత్తుకుపోతారు, భద్రం.

వెం॥ ఎవరు!

కా॥ ఎవరంటే వారే.

వెం॥ ఎత్తుకు పోనిస్తావా?

కా॥ ఆడదాన్ని నే నేంచెయ్యను? మగవారు మీరు జాగ్రత్త పెట్టుకోవాలి. యింక రండి లోపలికి వెడదాం.

వెం॥ ఇట్లా బావుండలేదూ?

కా॥ బావుంది. కాని పడుకుందాం, పోయి-

వెం॥ పడుకోడానికి రాత్రంతావుంది. కాని నీమీాదనించి విసిరే యీగాలి ననుభవించడానికి వీలుంటుందా?

కా॥ ఎంతసేపు వూరికే నావంక యిట్లా చూస్తూ కూచుంటారు. చేతులో వెన్నముద్ద పెట్టుకుని చూసినట్లు.

వెం॥ కాకి తన్నుకుపోతుందా?

కా॥ ఏమో!

వెం॥ నీకూ ఆ సందేహమే?

కా॥ ఏ సందేహం?

వెం॥ వుంది, వుంది. ఆసందేహం వుంది. నీమనసులోవుంది.

కా॥ చెప్పండి, ఏమిటో అది?

వెం॥ అంతేకాదు. ఎవరిమీాదోకాదు. నీమీాదే, నీమనసుమీాదే లేదు నీకు విశ్వాసం — అదేకాదు, నామీాదలేదు. అవును. వొట్టి బలహీనుణ్ణి, నేనేం కట్టివేయగలను నీమనసుని. యేనిమషాన యేదురదృష్టదేవత తన్నుకుపోతుందో నాయీా నిధానాన్ని. ఇంత సౌందర్యం, యింతచతురత్వం యీానిర్భాగ్యుడికి దక్కుతుందా?

కా॥ ఏమిటా పిచ్చివాగుడు?

వెం॥ అవును, అదే, అదే! అవును పిచ్చివాగుడు, వాగే పిచ్చివెధవను.

కా॥ అయ్యో! మీమీద ప్రేమలేకపోతే, మిమ్మన్ని ప్రేమించ తెలుచుకోకపోతే మిమ్మన్నెందుకు పెళ్లి చేసుకుంటాను?

వెం॥ అట్లాంటి అబద్ధాలే నాకు మరింత భయం పుట్టించేది. పోనీ మాట్లాడకండా వూరుకోరాదూ?

కా॥ ఎందుకట్టా అంటారు? నేనేంచేశాను? లోపలికిరండి అన్ని సందేహాలు పోతాయి.

వెం॥ నువ్వేంచెయ్యలేదు. నాజాతకం. నాఖర్మం. నేను వెధవని. నన్నెవ్వరూ మోహించరు. మోహించినా త్వరలోనే తెలుసుకుని మానేస్తారు. నిశ్చయం, యిది నిశ్చయం.

కా॥ అంత నిశ్చయమైపోతే యెందుకుపెళ్ళి - అందులోనూ రెండు పెళ్ళిళ్ళు చేసుకున్నారు.

వెం॥ అందుకనే శుద్ధ వెధవని గనక ఎదురుచెప్పడం చాతగాని చచ్చుపీసిగని గనక. తిరగబడాలనే వుంటుంది. అనుకుంటా. మాటకూడా చివరికి నోటిచివరికి వొస్తుంది. అనలేను. నడు మెత్తాలనే వుంటుంది. కాని యెవరో విరక్కొట్టినట్టు కిందికి వొరుగుతాను.........

కా॥ పోనీండి.

వెం॥ ఇదివరకంతా అదొక లోపంగా కనపళ్లేదు. కాని నిన్ను చూసినప్పణ్ణించి నాకు నువ్వెక్కడ తప్పిపోతావోననే భయం పట్టుకుంది. నా అశక్తతేకద దానికి కారణం. విమలతో వున్నన్నాళ్లూ నాకెప్పుడూ యిటువంటి బాధ కలగలేదు. నిన్నుచూసిన ప్రతిసారీ నాగుండె బిగపడుతోంది. (మెల్లిగా ఆమె పాదాలదగ్గిరికి జారుతో) లాభంలేదు. నాకాశక్తి రాదు. నాకు తెలుసు. నిన్ను నిలుపుకోలేను. నువ్వే

నన్ను కటాక్షించాలి. నామీద జాలితలిచి నన్ను వొదిలి పోకు. నన్ను చంపివెయ్యకు. నన్ను ద్రోహంచెయ్యకు.

కా॥ అయ్యో! మీ భార్యని, మీ దాసిని, నా పాదాలముందు యిట్లా పడతారేమిటి ?

వెం॥ నాభయం. అదే కారణం. నాకు తెలీదనుకోకు, ఎంత దాచినా. నేను శుద్ధ అవివేకినికాను. ధైర్యంలేదు గాని కుశాగ్రబుద్ధి — నాకుతెలుసు — అసలు నన్నెందుకు పెళ్లి చేసుకున్నావు — మీనాన్న బలవంతం కావనకు — ఎందుకా అబద్ధం ? కాకపోతే నన్ను వొలిచి చేసుకున్నావా !

కా॥ బలవంతం యేముంది ? మంచి సంబంధంవొస్తే చెయ్యాలను కుంటున్నారు, చేశారు. అదీ తప్పే !

వెం॥ అందుకనే — నామీద నీకేం నిలకడవుంటుంది ! నీకళ్లలోనే తెలుస్తోంది. భర్త గౌరవం, భక్తీ నీకులేదు ! నీకళ్లలోనే తెలుస్తోంది !

కా॥ ఐతే, అసలు, పెళ్లి ఎందుకు చేసుకుంటాను ? భర్తని గౌర వించాలనే కదూ ?

వెం॥ అదుగో, యింకా అబద్ధాలాడుతున్నావు. ఇప్పుడే యిన్ని అబద్ధాలాడేదానివి నన్నెంత క్షోభపెడతావో యింకముందు. ఎందుకు పెళ్లి చేసుకున్నావు ? నా డబ్బుచూసి, నా యిల్లు చూసి, సుఖపడవొచ్చునని ! సుఖపడగానే యింక పోకిళ్లు పుట్టుకొస్తాయి.

కా॥ అటువంటి నీచజాతికి పుడతాయి ఆ బుద్ధులు !

వెం॥ అదుగో ! ఆమాటలు ! ఎంత అనుభవమో ! ఎంత తెలివో ! ఏం చెయ్యనునిన్ను ! పో, పో, వొద్దు.........వెళ్లకు.

నన్ను వొదలకు.........ఎందుకింత అందంగా వుంటావు. అందరూ చూస్తారు నీవొంక! అందరూ కోర్తారు నిన్ను! నీ అందాన్ని నాశనంచేస్తే! నీకు బొగ్గు పూస్తే, నీ కన్ను పొడిస్తే, అదికాదు, నీముక్కు కోస్తాను.

కా॥ (లేస్తో) పిచ్చా, యేమండీ?

వెం॥ పిచ్చే! పిచ్చే!

కా॥ నిజంగా పిచ్చిలాగేవుంది. నాకు భయమేస్తోంది.

(వెళ్లబోతోంది)

వెం॥ వుండు: వెళ్లకు. నాతోడు — ఆగు.

కా॥ ఏమిటి?

వెం॥ పోనీ. ఈ వొక్క వరంయియ్యి. తమాషాకి అంటే, నిజంగా పట్టుకుని అట్లా భయపడతావేం? పిచ్చిపిల్లా! నిజంగా కన్నుపొడిచే ఘాతుకుణ్ణనుకున్నావా? కూచో, ముందుకూచో, చెపుతా! సరే ఒకవరం యిస్తావా?

కా॥ వరమా? వరమేమిటి? ఇది యింకో పిచ్చి, నన్ను వెళ్లి పోనియ్యండి. (వెడుతోంది)

వెం॥ వెడుతున్నావా! నేను ముందే చెప్పలా! నా దగ్గర యెందుకు వుంటావు నువ్వు. నాకు తెలుసుగా! అయిపో యింది. ఆఖరే! అప్పుడే! ఈ గంటలోనే నా బతుకు ఆఖరా! ఆఖరా! అయ్యో! చంపావా నన్ను! రాక్షసీ! దెయ్యం! పో, పో, యింకేం, పో కాచుకుని ఉన్నారు అందరూ. పో.

కా॥ ఇదేమి టీ రాత్రి నాకు! ఎంతోఆశపడి, ఎన్నోకలలుగని —

వెం॥ నిజంగానే! అయ్యో, పాపం! నిజంగానే నామీద మోహ పడి వొచ్చావా అంతగా!

కా॥ నిజంగా! చెపితే నమ్మరుగా.

వెం॥ నమ్ముతాను, నమ్ముతాను, యిట్లారా.

(తొరగావొచ్చింది-బుజ్జగిస్తున్నాడు. కామాక్షి చాలా సంతోషం చూపుతోంది)

కా॥ యీకాస్త భాగ్యానికీ, యెందుకు అంత బాధపడ్డారు. పోయినాయా మీ భయాలన్నీ?

(అతన్ని వొత్తుకుంటోంది. వెంకటచలం ఆమెని చప్పున వొదిలాడు)

వెం॥ ఎందుకీ అబద్ధాలు నాతో! అన్నీ అబద్ధాలే! అన్నీ నీకు కొత్తా! మోహం నీకు కొత్తా! ఎన్నోసారి, యిది?

కా॥ ఇంకేం మాట్లాడను?

వెం॥ నాకు తెలీదూ? కొంచెం సిగ్గు, కొంచం కొత్త - యీమ న్నా వున్నాయా? నేను నిన్నేంచేశానని, నీకే ద్రోహం చేశానని యింత మోసం చేశావు? ఇప్పుడింకేం చెయ్యను!

కా॥ పరిమాణపూర్తిగా—

వెం॥ నోరుముయ్యి, నిన్ను చంపనా, కొయ్యనా?

కా॥ ఎందుకండీ, యిట్లా తిడతారు? నాకేమీ అర్థంకావటం లేదు...ఏంమాట్లాడను? ఏంచెయ్యను? మీకు సంతోష మెట్లా కలుగుతుంది.

వెం॥ ఎట్లా కలుగుతుంది! ఎట్లానూ కలగదు. నాకీబాధ అర్థం కాదు. నిన్ను కావిలించుకుంటే, దాచుకుంటే మాత్రం నాకీ అనుమానం, నువ్వు తప్పించుకుపోతావనే భయం

పోతుందా? నిన్ను చంపితే — అవును. నిన్ను ఎవరికీ దక్క-కండా కోసేస్తే—

కా॥ పిచ్చే మళ్ళీ, నేను వెడతా.

వెం॥ వెడతావా! నా నించి పోతావా! పో, తప్పుడుముండా, యెట్లా పోతావు?

(గట్టిగా పట్టుకున్నాడు.)

కా॥ మీ కాళ్లు పట్టుకుంటా, ఎన్నడూ మిమ్మన్ని వొదలను.

వెం॥ నిజమేనా?

కా॥ నిజం.

వెం॥ నే నెన్నోవాణ్ణి? నిజం చెప్పు.

కా॥ అట్లా అనకండి. మీరే—

వెం॥ అబద్ధం. చెప్పు—

కా॥ ఏంచెప్పను?

వెం॥ నాలుగోవాణ్ణా, ఐదోవాణ్ణా—

కా॥ నాలుగోవారు.

వెం॥ మంచిది. ఇంక నన్ను వొదిలి యింకోరి దగ్గిరికి వేంచెయ్యవు కద!

కా॥ నిజంగా వెళ్ళను.

వెం॥ ఇట్లారా (దగ్గిరిగా కళ్ళల్లోకి చూస్తున్నాడు.) నిజమా?

కా॥ నిజం.

వెం॥ (చప్పున) కాదులే. ఎట్లానూ వొదులుతావు. ఎట్లా నూ పోతావు. నమ్మకంగా కనపడ్డా పైకి, నా వెనక నీ కళ్లు వెతుకుతోనే వుంటాయి. నువ్వు విశ్వాసంగా వుండా లనుకున్నా, ఆ కళ్లు నిన్నీడ్చుకుపోతాయి. అయ్యో! యీ

అగ్నిని తెచ్చిపెట్టుకున్నానే...ఏంచెయ్యను...సరేలే......
మరిచిపోయినాను......సరే. ఎట్లానూ పోతావుగాని—
పోనీ వరం యియ్యి.

కా॥ వరమా!

వెం॥ అదుగో, వరమా, అంటున్నావా? నాకు తెలుసు మళ్ళీ
వెనక్కు తగ్గుతావని! అబద్ధపు బతుకు. పో, పో, నాకు
కనబడక పో.

కా॥ వరమేమిటి? ఏమిటావరం? చెప్పండి.

వెం॥ ఇస్తావా?

కా॥ చెప్పండి.

వెం॥ ముందు చెప్పు.

కా॥ ఆ!

వెం॥ విను. ఎట్లానూ నేను నీకు సరిపోను. నా అమ్మ డబ్బు
కాశపడి యిక్కడ చేరావు. ఎట్లానూ యితరుల్ని వెతు
క్కుంటావు. ఆ గతి నీకూ, యీ గతి నాకూ యెవరూ
తప్పించలేరు. నీ యిష్టం. నేనేమీ అనను. ఎవడైనాసరే,
ఎవడితోనన్నాసరే— ఆ తోట రాముడితో, ఆ పోస్టుసాయే
బుతో, బండివాడితో- నీ యిష్టం- నాకేమీ అభ్యంతరం
లేదు. కాని నాకీ మాటయియ్యి- వాగ్దత్తం చెయ్యి -
ఆ నారాయణ, ఆ నారాయణ వెధవ- ఆ పాతకి- ఆ చండా
లుడు- వాడిమొహం చూడ నను- ప్రమాణం చెయ్యి-
చేస్తావా?

కా॥ ఇంతేనా? మీరు నన్నడగాలా? మీరు అడక్కపోతే
మాత్రం- అసలు మొదట వాణ్ణి చూడగానే-

వెం॥ సరేలే. ప్రమాణంచెయ్యి.

కా॥ (గోముగా) చేస్తాను. దానికేం? కాని మీా కాయనమీాద యెందుకంత కోపం? తోటవాడికంటె—

వెం॥ అహా, బాగావుండడా అంటున్నావు, అవునా? అదుగో, దుర్బుద్ధి- నాకు తెలుసు.

కా॥ ఛా, ఛా, వాణ్ణిచూస్తేనే నాకు అసహ్యం. నాకు కోపం.

వెం॥ నిజమేకద! నీకు వాడిసంగతి తెలిస్తే యింకా అసహ్యపడ తావు. ఆడవాళ్లని పురుగుల్లాగు లాగుతాడు. మంత్రిస్తాడు. మందులు పెడతాడు.

కా॥ అన్నీ విచిత్రాలు, పొండి.

వెం॥ ఆ, లేకపోతే ప్రతి ఆడదీ, చివరికి విమలవంటి గుణవంతు రాలు సహితం వాడివెంట యెందుకు పడుతుంది?

కా॥ విమల గుణవంతురాలా యేమిటి?

వెం॥ అత్యుత్తమురాలు.

కా॥ మరి యీా పని?

వెం॥ నేను చెప్పేదేమిటి? అది వాడి మంత్రప్రభావం.

కా॥ మంత్రింకాదు. యేంలేదు. శుద్ధపోకిరీ-

వెం॥ వాడి అందం-

కా॥ అందం వుండనీండి. శుద్ధపోకిరీ యేనా?

వెం॥ వాడిధైర్యం-

కా॥ అవును. అది నిజమేకాని పోకిరే కదూ!

వెం॥ ఆ, బలేపోకిరీ!

కా॥ చాలామంది ఆడవాళ్లని మోసంచేశాడు.

వెం॥ ఆ, ఎందరినో-

కా॥ ఇప్పు డింకా వున్నారా, ఆ వెధవకి!

వెం॥ ఎంతమందో!

కా॥ ఇంక నేనెందుకులెండి. నా వంక చూడనే చూడడు.

వెం॥ వాడికి యెంతమంది దైతేనేం! ఇంకా కావాలంటాడు. అందులో నీవంటి అందమైనది కనపడ్డదంటే, వెంబడి తిరుగుతాడు.

కా॥ కాని నాకు లక్ష్యమా! నేను కన్నెత్తి చూస్తానా? అప్పుడు వాడే నన్ను వెంబడించడం మానాడు.

వెం॥ మరి నా వరం—

కా॥ చెప్పండి, వెంబడించడం మానతాడుకద! కాక అదేపనిగా, సిగ్గులేకండా, నేనే కావాలని మదమెక్కి తిరుగుతాడా?

వెం॥ ఎందుకు అడుగుతావు?

కా॥ అట్లా తిప్పి తిప్పి యేడిపించాలి, అట్లాంటివాళ్ళని— పోకిరీ ముండాకొడుకులు.

వెం॥ వాణ్ణి తిప్పనూవొద్దు- వాడివంక చూడనూవొద్దు- సరేలే యిన్ని మాటలు మాట్లాడతావుగాని, ఆ ప్రమాణం చెయ్యవుకద ముందు-

కా॥ అసలు యేమీ సంబంధం వుండడానికి వీల్లేనప్పుడు, నా మనసు గట్టిదైనప్పుడు- ఆ కుక్క వెంటబడితే మాత్రం.

వెం॥ వెంటబడ్డాడు. అవునా?

కా॥ పడితేమాత్రం—

వెం॥ వెంటబడ్డాడు- యింకవూరుకోడు- నిన్నుపట్టిందాకా వూరుకోడు. నాకు తెలుసు. ఏం చెయ్యను? ఎట్లానూ నాడి దానివే!

కా॥ ఛీ, ఛీ!

వెం॥ ఆ, ఆ నిన్ను తీసుకుంటాడు. వాడికి నిన్ను దక్కనీను. వాడు నన్నుచూసి నవ్వితే నేను భరించలేను. నా కొత్త పెళ్లాన్ని, యీ అందాన్ని, నిన్నుకూడా, నాకుదక్కకుండా, వాడేలాగితే- యిదివరకేలాగేడేమో- అవునా? అవునా? నిన్న సాయింత్రం, యేంచేస్తున్నావు? ఆ, ఆ- నిజం చెప్పవే, నన్ను చంపకే!

కా॥ ఛీ, ఛీ! అకుక్క - ఆవెధవ.

వెం॥ ఎందుకు? లే, రా, యీరాత్రికన్నా నాదానివే! ఆ తలుపు నిన్ను నాకిస్తుంది. లోపలికిరా. ఈ రాత్రికి నిన్ననుభవించి తరవాత- తరవాత- చంపుతానో- యేంచేస్తానో- రా (లోప లికి తీసికెడుతున్నాడు.)

(విమల వొచ్చింది)

వి॥ నేను — విమలని — ఒక్కసారి బైటికిరండి అవసరం.

(వెంకటచలం తలుపుతెరుచుకుని వొచ్చాడు)

మీ ఆనందానికి విఘాతం కలగచేశాను క్షమించండి. మీదగ్గిర శలవుతీసుకోడానికి వొచ్చాను. నేను వెడుతున్నాను.

వెం॥ వెడుతున్నావూ, ఎక్కడికి ?

వి॥ ఎక్కడికో ! ఎక్కడికైతేనేం ?

వెం॥ వెళ్ళి —

వి॥ ఏమో, నాకు తెలీదు.

వెం॥ నీకేదో మనస్తిమితం తప్పింది. పాపం, నీకింత కష్టంగా వుంటుం దనుకోలేదు. అమ్మని పిలుస్తాను వుండు.

వి॥ వొద్దు. యిద్దరిభార్యల సమస్య మీకు వుండనే వుండదు.

వెం॥ అంతకోపమా ?

వి॥ మీా మీాదా! ఏమీా కోపంలేదు.

వెం॥ మరి —

వి॥ నావిధిని నెరవేర్చుకుంటున్నాను.

వెం॥ ఏమిటా విధి!

వి॥ వెళ్లడం.

వెం॥ ఇన్నాళ్లమట్టీ యెట్లా వున్నావు, మరి ?

వి॥ ఈనాడు మాయ విడిపోయింది. జ్ఞానదృష్టి కలిగింది. సత్య దర్శన మయింది.

వెం॥ ఏం మాయ ?

వి॥ భార్యా, భర్తా, తల్లి, బిడ్డ — అనే మాయ.

వెం॥ వేదాంతం మాట్లాడుతున్నావు.

వి॥ మాయకదూ ? నన్ను భరించడానికి శక్తిలేని మీారు నా భర్తా! ఎన్న డీ పంజరంలోంచి బయిటపడగలనా అని తీగెలు కొరికే నేను భార్యనా? పుట్టిననాటెనించి నామీాద ద్వేషం, ఉగ్గుపాలుగా పెరిగిన వీళ్లు నా పిల్లలా! ఒక్క చొక్కా, ఒక్క కాని కలకండ కొనిపెట్టలేని నేను తల్లినా! ఈ కలల్లోనించి వాస్తవమైన విశాలప్రపంచంలోకి ప్రయాణ మవుతున్నాను. ఆశీర్వదించండి.

వెం॥ ఏమిటె, అట్లా మాట్లాడుతున్నావు?

వి॥ పిల్లలిద్దరూ అమ్మమ్మ కుట్టించిన పట్టుపరుపుమీాద నిద్రపో తున్నారు. మీారూ, మీా నూతన వధువూ, యిక్కడ క్రీడిస్తున్నారు. ఆ ముసలామె తన ప్రియశిష్యుడు నారా యణరావుని ఏమూలో లాలిస్తోంది .— నేనే ఏకాకిని! ఎవ

రికీ కానిదాన్ని. ఒక్క హృదయంలో యే బంధమూలేదు. నిరర్థక జీవిని. జీవకళేబరాన్ని !

వెం॥ పోనీ వెళ్లడమెందుకు ?

వి॥ వుండడమెందుకు ?

వెం॥ వుంటేనేం ? మాకన్న నీ కాప్తులెవరు ! పుట్టిల్లనేదికూడా లేదుకద నీకు !

వి॥ ప్రేమశూన్యమైన బంధనాలుగల ఆప్తులకన్న, ముఖ మెరగని కొత్తవారు ఎక్కువ ఆదరిస్తారు. ప్రేమకోసం జాచే చేతులు ప్రతినిమషమూ గాయపడవు.

వెం॥ లోకమంటే నీకేం తెలుసు !

వి॥ తెలుసుకోడానికే యీ యాత్ర.

వెం॥ ఎందుకు తెలుసుకోడం !

వి॥ లోకం సంగతి తెలీదనే, లోకమంతా దుర్జనమయమనీ, కఠినమనీ, భయపడి ఇంటోపడి వుండాలనేగా, ఆడదానికి లోకమంతా తెలీకండా చేసేది ! అభయం పోగొట్టుకునేందుకే.

వెం॥ నలిగిపోతావు !

వి॥ ఇక్కడ !

వెం॥ అదివేరు.

వి॥ చూస్తాను. నేర్చుకుంటాను.

వెం॥ ఎందుకు ?

వి॥ నా ఆత్మ వికాసానికి.

వెం॥ పాపంలో పడిపోతావు. నీ స్వాతంత్రంవల్ల ఫలమదే !

వి॥ అవును. అవసరమని తోచినప్పుడు, పాపం చెయ్యడానికి

స్వతంత్రం కావాలి. ఇతరులు కల్పించే దుర్గతికాక స్వబుద్ధి కల్పించుకున్న నరకసౌఖ్యం కోరుతున్నాను.

వెం॥ ఎక్కడో ఆ గుడిపాటి వాడి పుస్తకాల్లో చదివావు యీ మాటలు. కాని ఆడదానివి, వొంటరిదానివి-

వి॥ ఆడదాన్ని, దిక్కులేనిదాన్ని, కనకనే నన్నింత అన్యాయం చెయ్యగలిగారు. ఇక్కడైనా ఏకాకినే-

వెం॥ పదేళ్లు కాపరంచేసికూడా, ఎవరి ప్రేమనూ సంపాయించలేని లోపం నీదికాదూ?

వి॥ అవును. ఆలోపనివృత్తికోసమే వెడుతున్నాను. నన్నెందుకు ప్రేమిస్తారు, యిక్కడ? ప్రేమించేవారికి యివ్వడానికే, హృదయసంపదలేని, యీ శూన్యురాలి నెవరు పేమిస్తారు? జ్ఞానభాగ్యాన్ని, భావసువర్ణాన్ని సంపాయిస్తాను. ప్రేమకోసం ప్రతి గుమ్మం దగ్గిరా బిక్షమెత్తుతాను.

వెం॥ మోసపోతావు.

వి॥ ఇక్కడకంటేనా? పెళ్లి, భర్త, గృహం, భార్య గృహలక్ష్మి, అనే మాటలు బోధించే నీతివేత్తల చేతుల్లో మోసపోయినాను. అవి విచ్ఛేదం చేసుకుని ఐనాసరే జీవితంలో అనుభవభాగ్యాన్ని పొందమనే వారి మాటలు అనుకరిస్తాను. ప్రతి అపజయమూ, ప్రతి మోసమూ, ప్రతి నైతికపతనమూ, నా కాళ్లకి బలము నిస్తుంది. నా కళ్లకి వెలుగు నిస్తుంది.

వెం॥ నామీద కోపమైతే, పిల్లలేంచేశారు? తల్లివి. కన్నగర్భమూ లేక-

వి॥ కన్నగర్భం కనకనే, పేరిమో, ప్రేమో, అని అరిచి, అరిచి భగ్గుమని దహించింది. నన్ను, నా గర్భం ద్వేషిస్తోవుంటే

సహించగలనా? ఈ నాడా యిద్దరూ నాకళ్ల ముందు చసే నా కింత బాధవుండదు. వాళ్ల చూపులముందు సిగ్గుతో తలవొంచుకోడంకన్న అసలు మాయమైతే చాలామంచిది. ఇంకావుంటే ఇంకా చులకనౌతాను. పోతే, నా ప్రేమ కార్యాలు జ్ఞాపకముంచుకుంటారు. నా ప్రేమ వాళ్లకి అవసరంలేదు.

వెం॥ కాని వొదలగలవా?

వి॥ వొదలలేను. కాని తప్పదు.

వెం॥ చంటిపిల్లలు వాళ్ళకేం తెలుసు?

వి॥ అవును. వాళ్ళకేం తెలుసు?

వెం॥ ఎందుకు వొదలడం?

వి॥ నాప్రేమ వాళ్ళకి అవసరమూ, వుపయోగకరముగా చేసేందుకు మాతృత్వానికి కావలసిన జ్ఞానాన్నీ, అధికారాన్నీ, యోగ్యతనూ సంపాయించేందుకు. వాళ్ళని, నావాళ్ళని చేసుకునేందుకు.

వెం॥ నీవాళ్ళుగాక యెవరివాళ్ళు?

వి॥ నిజమా! నాపిల్లలేనా!

వెం॥ కాదూ? తొమ్మిదినెలలుమోసి, కని, పెంచి—

వి॥ అవును. నాపిల్లలే! ఆడి తప్పరుకద?

వెం॥ అంటే—

వి॥ నా పిల్లలేగా! నావెంట తీసుకువెడతాను.

వెం॥ నీవెంటా?

వి॥ నా వాళ్ళుగా!

వెం॥ తీసికెళ్ళి ఏంచేసుకుంటావు?

వి॥ అదంతా చెపుతాలెండి. తీసుకువెళ్ళనా?

వెం॥ తీసికెళ్ళడానికా! నాకో?

వి॥ మీకా? మీకు కలుగుతారు.

వెం॥ అమ్మకో! అమ్మ యేమంటుంది?

వి॥ ఆమె పిల్లలా? తల్లిని- మొయ్యడానికి, బాధలు పడడానికి, చాకిరిచెయ్యడానికి- తీసుకు వెళ్లడానికికాదు. నా పిల్లలే! పిల్లలు! నాపిల్లలా? ఎప్పుడు? ఆకలేస్తే 'అమ్మా, అన్న' మన్నప్పుడు నేను అన్నం పెట్టగలిగితే 'చలివేస్తే' బట్టలు నేను కట్టించగలిగితే, ఆపదలు వొస్తే రక్షించగలిగితే, అప్పుడూ అమ్మను. అప్పుడూ వాళ్ళకి నామీద ప్రేమ! వృద్ధురాలిని నామీద గౌరవమా? 'ఛీ! ముండా' అంటే, 'నువ్వేముండవి' అని ఆమెనీ 'నువ్వేవెధవ్వి' అని మిమ్మన్ని అనగలిగినప్పుడు నామీద గౌరవం వాళ్లకీ వొస్తుంది, మీకూ వొస్తుంది. నామీద నాకు గౌరవం కలిగినప్పుడు, మీఅందరికీ కలుగుతుంది.

వెం॥ సంసారివై, నీబాధ్యతలను నెరవేర్చుటవల్ల గౌరవమొస్తుందిగాని- ధర్మాన్ని, నీతిని—

వి॥ ఏమిటా బాధ్యతలు? ఏమిటాధర్మం! అత్త వేరే కోడల్ని తెచ్చుకోవొచ్చు. కోటువలె భర్త భార్యని మార్చుకోవచ్చు. పిల్లలు అమ్మమీద తిరస్కారం చూపవొచ్చు. కాని ఎన్నటికీ మారనిదీ, తెగనిదీ, శాశ్వత శృంఖలమై దాస్య వృత్తికన్న హీనమైన స్థితిలో బంధించేది ఒక్క-భార్యత్వమేనా!

వెం॥ ఆడదానవై నాక—

వి॥ దాస్యానికికాను- నాభార్యత్వంతో, నామాతృత్వంతోబాటు క్షుద్రమైన నా స్త్రీత్వాన్నికూడా త్యజిస్తున్నాను.

వెం॥ త్యజించవు- పంచిపెడతావు.

వి॥ అవును. ఒక గడియస్వేచ్ఛకు, జీవితానికి అపురూపమై పోయిన మాధుర్యం కోసం, అమ్ముకున్నాను నాదేహాన్ని! నిజం! అవును. నా కోసమే, నన్నుకోరాడు అతను- అతను వొక్కడే, యీఘోరపంజరంలో రెక్కలు చప్పుడు చెయ్య సాహసింపగలడు. అతను వొక్కడే - పాపం చెయ్యడాని కైనా స్వేచ్ఛవున్న ధీరుడు. అతను వొక్కడే!

వెం॥ ఆహా, చాలా యోగ్యుడు దొరికాడు, నువ్వు మెచ్చుకో డానికి !

వి॥ నాకు తెలుసు, అతని మాటలు అబద్ధాలని, అతని చూపులు అస్థిరాలని. కాని మీ తల్లి శలవుమీద ఆధారపడే, మీ విధేయ ప్రేమకన్న, నీతిబంధాలు తెంచుకునే సాహసంతో నన్ను యీడ్చుకుపొయ్యే తాత్కాలిక కామమే మధుర మయింది. హేయమే! కాని మంగవలె మూలపడి బూజు పట్టిన నా జీవితానికికూడా వుపయోగముంది. యెంత నీచ మైనా, తాత్కాలికంగానైనా యింకొకరిని తృప్తిపరచగల దనే ఆశ యెంత ఆనందకరమైనది!

వెం॥ కాని, నీ పాతివ్రిత్యం, నీ నీతి—

వి॥ నా నీతా! మీరు, మీరుకూడా నా నీతిని ఖండించేవా రేనా? వొట్టిపోయినగొడ్డుని వొదిలినట్టు పదేళ్ళు వుపయో గించుకుని, కొత్తభార్యకోసం, వొదలడం, ధర్మమేనా? మీ శాస్త్రాలు స్త్రీలకు బుద్ధిలేదని ఎంత ఘోషించినా, ఈశ్వరు

డిచ్చిన బుద్ధి నశించలేదుమరి! ఎందుకు యీ వాదన, వెడుతున్నాను.

వెం॥ ఈ అర్ధరాత్రి యెక్కడికి?

వి॥ జీవితమంటే యింతే. ఈ రాత్రి బెంగపడతారు, ఆ గదిలోకి వెళ్ళిందాకా. రేపు పడతారా! వెడుతున్నాను.

వెం॥ వీల్లేదు.

వి॥ ఆజ్ఞలు వినేకాలం దాటిపోయింది. అన్ని భయాలూ విచ్ఛిన్నమైనాయి.

వెం॥ అమ్మ యేమంటుంది!

(విమల నవ్వింది) అమ్మా, అమ్మా.

వి॥ అమ్మ యేంచేస్తుదండీ! ఇక్కడ వుండతలుచుకున్న వారికి భయాలుగాని నాకేమిటి?

(మంగమ్మ వొచ్చింది.)

మం॥ ఏమిటిది?

వెం॥ ఇది యెక్కడికో వెడతానంటోంది.

మం॥ వెళ్ల తలుచుకుంటే వెళ్లనీ.

వెం॥ ఏమిటి, అమ్మా! నీకూ్కడా మతి భ్రమించిం దీ రాత్రి! వీల్లేదు. వెళ్లనీకు.

మం॥ ఐతే ఆపు.

వెం॥ అందుకునే నిన్ను పిలిచాను.

మం॥ ఇంత శుద్ధ అప్రయోజకుడివి గనకనే నీ భార్య నిన్నొదిరించి పోతానంటోంది. నీ కళ్లయెదటే యింకో మొగాడితో నాట్యమాడింది.

వి॥ ఆయన్ననకండి. అన్యాయం! పదేళ్లనించి చూస్తున్నాను. ఆయన పాపాలకీ, లోపాలకీ, వసంతునంటే, యెంతకార్యమో అంతే. (వెంకటచలంతో) నేను కాపరానికొచ్చి వారం రోజులయిందిగావును. జ్ఞాపకంలేదూ? ఆరోజు మధ్యాన్నం 'చిత్రాంగి' చదువవొద్దన్నారు. ఆపుస్తకాన్ని సంతోషంతో చించిపారేశాను. ఇంగ్లీషు మాట్లాడుతో వుంటే, వొద్దన్నారు, జాకెట్లు మానమన్నారు. కారణమడిగానా? నాదైవానికీ, మీకు, యిష్టంలేదనుకున్నాను. ఆనందంతో మానాను. కాని ఆమర్నాడే తెలిసింది. ఆచిత్రాంగిమీది కోపం మీదికాదనీ, యింగ్లీషుమీది ద్వేషం, జాకెట్లమీద అసహ్యం, అవన్నీ; అన్నీ — మీ భావాలు, ఆజ్ఞలు, రుచులు, పుణ్యాలు, అన్నీ ఆమెవని. మీరు పుత్సనిగ్రహం ఆమెచేతుల్లో కీలుబొమ్మ, ఆమె పెంచుకున్న కుక్కపిల్ల. ఈనాడు, యిప్పుడు, మీ స్వబుద్ధితో ఆజ్ఞాపించండి — నిప్పుల్లో నడుస్తాను. కాని 'ఏం చదవ'నంటే 'అమ్మనడుగు' 'ఏం కట్టుకుంటే మీకు బావుంటుం' దంటే. 'అమ్మ యేమంది'.........అంతా, అమ్మ, అమ్మ, అమ్మ, ఇంక మీమీద నాకేం గౌరవం, భక్తి. అవును, నేను అధర్మం చేశాను. కొట్టండి, నరకండి, కాని 'అమ్మా చూడు' అనకండి — మీరూ ఒక మనుషులే? మీరూ ఒక భర్తేనా? (మంగమ్మతో) నేను చూశాను. మీరు నా పిల్లల్ని పెంచే విధంలోనే తెలుస్తోంది — యీయన్ని యెట్లా నడుంవిరిచి, వెన్నెముక పడిచి, మెదడుని చితకకొట్టి, యీ చలిమిడి ముద్దని తయారుచేశారో! నేను కాపరానికి రాగానే నన్నూ

అట్లా మీ చేతులో మైనంవలె వొత్తి మీ చిత్తానుసారం మార్చాలని చూశారు. నేను స్వాధీనం కాకపోవడంచేతనే కద, నేను విరోధినైనాను. ఇంటిదగ్గిర మాఅమ్మ నేర్పిన పద్ధతులన్నీ యిక్కడ అపచారాలైనాయి. సన్న చీరెలు, పక్కపాపిడి, సబ్బు, అన్నీ ఘోరపాపాలా? నా భర్తని ఆకర్షించడం భోగంటక్కులా? ఎన్నడూ నామనసులోలేంది, నారాయణకూ, నాకూ సంబంధం పుకారుపెట్టింది, మొదట మీరుకాదూ? అదేకారణం, ఆ అనుమానం నిజంకావడానికి. ఈమె మనసుకి ఆనిమిషాన యేది మంచిదనితోస్తే అది నాకు వేదమా? మా అమ్మని పదిమాట్లు తలుచుకోడం, ప్రేమించడం బూతా? పూజ్యురాలైన మాఅమ్మని, నాచాతనే, 'లంజ' అనిపించింది, ఇది, యీ ముసలిముండ.

మం॥ అయిందేమో, అయింది. ఇప్పుడవన్నీ ఎందుకులే!

వెం॥ వెళ్లడానికి వీల్లేదు.

వి॥ (మంగమ్మతో) చూడండి.

మం॥ (చిరునవ్వుతో) నేనెవర్ని? నీ భర్త! ఐనా కొత్తగా స్వతంత్రురాలివి నువ్వు— నేను వెడుతున్నాను. అబ్బాయీ నీకు యుక్తమని తోచింది చెయ్యి. నాకు తెలీదు.

(వెళ్ళింది)

వి॥ వెళతాను — ఒక్క వరమియ్యండి.

వెం॥ వరమా!

వి॥ అవును — నా పిల్లలకి నామీదంతా అబద్ధాలు చెపుతుంది ఆమె — నేను దుర్మార్గురాలిననీ, లేచిపోయినాననీ — మీరన్నా కనికరించి, నామీద వాళ్లకి గౌరవంనిలపండి —

నిర్భాగ్యురాలనండి— దుర్మార్గురా లనకండి— చచ్చిందనండి— లేచిపోయిందనకండి.

వెం॥ (కన్నీళ్లతో) నువ్వు వెడుతో, ఇంకా యెందు కదంతా — వాళ్లేమనుకుంటే నీకేం?

వి॥ ఎందుకంటే — ఎందుకంటే, నాకు మళ్లీ రావాలనివుంది.

వెం॥ వీలుంటుందా?

వి॥ మీ దగ్గిరికికాదు — వాళ్లదగ్గిరికి. నామీద వుమ్మేసేట్టు చెయ్యకండి — మీపాదాలు పట్టుకుంటూ — వెడుతున్నాను శలవు. (వెళ్లింది)

(వెంకటచలం అట్లానేనుంచుని వున్నాడు. కామాక్షి వొచ్చి వెనక నుంచుంది, వెంకటచలం బుజంమీద చెయ్యేసింది.)

వెం॥ ఈ గోలల్లో, పాపం, నిన్ను మరిచిపోయినాను. ఏం చేస్తు న్నావు వొక్కతెవ్వూ?

కా॥ వింటున్నాను.

వెం॥ రా.

కా॥ ఏం చేస్తారిప్పుడు?

వెం॥ ఏం చేస్తానూ?

కా॥ వెళ్లిపోతోంది.

వెం॥ రెండురోజులు తిరిగి మళ్లీ వొస్తుంది.

కా॥ వెళ్లాలనే ఉద్దేశ్యమూనో, కాదో!

వెం॥ కాక?

కా॥ వేరే వుద్దేశ్యమూ?

వెం॥ అంటే —

కా॥ సాహసంచేసి, యీ నై రాగ్యంలో —

వెం॥ ఆ! —

కా॥ విచారం భరించలేక —

వెం॥ అవును — భరించలేక —

కా॥ యామన్నా దండగం —

వెం॥ అవును, అవును.

కా॥ ఏం చేస్తారు ?

వెం॥ ఏం చెయ్యను ?

కా॥ వూరుకుంటే యెట్లా ?

వెం॥ ఘోరం —

కా॥ చాలా......ఆపండి.

వెం॥ ఆపాలా ?

కా॥ అవును.

వెం॥ ఎట్లా ?

కా॥ వెళ్లండి.

వెం॥ వెళ్ళి......ఏం చెయ్యగలను ?

కా॥ కాని మనసంగతీ —

వెం॥ ఏం ?

కా॥ మనమీదికి —

వెం॥ మనమీదికా —

కా॥ అవును — మనమే చేశామని —

వెం॥ మనమా......ఛా !

కా॥ నమ్ముతారు......ఆమె అడ్డం తొలిగించాలని —

వెం॥ అవునా ? ఛా ! నిజమా ! ఎట్లా ? ఏం చెయ్యను ?

కా॥ వెళ్లండి.

వెం॥ అమ్మతో చెపుతా.

కా॥ అమ్మేం చేస్తుంది?

వెం॥ నేనేం చెయ్యను?

కా॥ జుట్టుపట్టుకు లాక్కురండి —

వెం॥ మళ్లీ వెడుతుంది.

కా॥ గదిలో తాళం వెయ్యండి.

వెం॥ ఎన్నాళ్లు?

కా॥ ముందు తీసుకురండి —

వెం॥. రాదు.

కా॥ ఆ......వసంతు లేచి ఏడుస్తున్నాడని చెప్పండి.

వెం॥ వాళ్లంటేనే కోపం —రాదు.

కా॥ కోపంలేదు — ఏంలేదు. తొరగా వెడుదురూ!

వెం॥ తరవాత —

కా॥ గొళ్లెం వెయ్యండి — తరవాత చూసుకుందాం.

వెం॥ ఎంత తెలివైనదానివే!

(వెంకటచలం వెళ్లాడు. కామాక్షి వాకిట్లోనుంచుని వుంది. నారాయణ సిగరెట్టు కాలుస్తూ వొచ్చాడు.)

నా॥ ఎవరు? నాకిన్నరసానేనా?......ఏదీ......ఒక చిన్న కీర్తనకానీ, విని ఆనందిస్తాను.

కా॥ నీ మొహానికి పాటకాదు. వుమ్మేస్తాను.

నా॥ వెయ్యిపోనీ. ఇంత దూరంగాపడదు. దగ్గిరికి వొస్తాను.

కా॥ అడుగు కదిలావంటే అరుస్తాను. పో.

నా॥ లోపలవున్నాడా?

కా॥ ఆ.

నా॥ (నవ్వుతున్నాడు) తొరతొరగా తలవొంచుకు పరిగెత్తు తున్నాడు. కొత్త పెళ్లాన్ని వొదిలి ఎందుకు పరిగెత్తుకుపో తున్నాడో చూడ్డానికి వొచ్చాను.

కా॥ ఇప్పుడే వొస్తారు.

నా॥ సగంలో యిట్లా నిన్ను వొదిలిపెట్టిన రసికుడికోసం చూస్తు న్నావా? ఈ కొత్త శోభనపురాత్రి, వొక్క-తెవ్వా, యిట్లా విరహంబాధతో జాగరణచెయ్యమని వ్రాశాడా ఈశ్వరుడు? పాపం! చూస్తా, చూస్తా నేనెట్టావూరుకోను?

కా॥ ఆ చెట్టుకు వురేసుకో చూసి సంతోషిస్తాను. (నవ్వుతోంది)

నా॥ చచ్చిన నన్నుచూస్తే అంత సంతోషమైతే, బతికివున్న వాణ్ణి నేను యెంత ఆప్యాయంగా వుండాలి!

కా॥ నీదెయ్యాన్నిచూస్తే, మరీ గంతులేస్తాను.

నా॥ కాని నీభర్తకూడా దెయ్యమంత అపురూపమైనవాడుగా!

కా॥ నీవల్లనే.

నా॥ అంత అదృష్టమే! ఐతే ఆలోపం తీర్చే బాధ్యత నాదన్న మాటే!

కా॥ నీకో బాధ్యతలు కూడాను, నీమొహానికి! (వుమ్మేస్తోంది.

నా॥ నామొహాన్నేమిా అనకు. అనిక మళ్లీ నువ్వేముద్దు పెట్టు కుంటావు దాన్ని.

కా॥ ముద్దులుకాదు- తంతాను.

నా॥ తన్ను (దగ్గిరికి వొస్తున్నాడు)

కా॥ దగ్గిరికి వొచ్చావా, తలుపు వేసుకుంటాను.

నా॥ నన్నూ లోపలికి రానిచ్చి వేసుకో!

కా॥ నీమొహం పగిలేట్టు వేస్తాను.

నా॥ ఎందుకు అంత ఆగ్రహం నామీద? వెనక దీపమూ-గుమ్మం లోనువ్వూ, గాలిలో యెగిరేజుట్టూ - కళ్లకీయెంత-

కా॥ ఛీ! నీతో మాట్లాడ్డమే మహాపాపం. మా నాన్నగారిని అట్లాంటి మాటలన్నీ అని సిగ్గులేక నాతో మాట్లాడుతున్నావా?

నా॥ నీమీది మమతచేతనే తిట్టాను.

కా॥ అబద్ధం.

నా॥ మనిద్దరికీ అడ్డం వొస్తాడని కోపం.

కా॥ నోరుముయ్యి- నేనెవరు? నువ్వెవరు?

నా॥ అయ్యో, అడుగుతావా?...నువ్వు చంద్రబింబం, నేను చాతకం. నువ్వు పద్మం, నేను తుమ్మెద. నువ్వు పచ్చని జామిపండు, నేను ఆకుపచ్చని-

కా॥ చాలించు కవిత్వం.

నా॥ నిన్ను చూస్తే ఒక్క- కవిత్వమేమిటి? ఎన్ని పుట్టుకొస్తున్నాయనుకొన్నావు? నీతెలివికలకళ్ళూ, గుండ్రనిరొమ్మూ, చూడగానే-

కా॥ వూరుకో.

నా॥ ఇక్కడ వొకరికీ కళ్లులేవు. నీ అందాన్ని చూసి మెచ్చుకోడానికి- చూడు, ఆ రొమ్మూ, ఆమెడా చూసుకో- ఒకసారి నువ్వే చూసుకో.

కా॥ (చూసుకుంటో) ఏముందేం? (కోపంతో) ఏమిటామాటలు?

నా॥ కుచ్చెళ్లనట్లా పాదాలమీద జార్చడం, చస్తే యీ దేశం వాళ్లకి చాతనవుతుందా? బుజంమీద ఆజుట్టు వేళ్లాడ్డమూ-

కా॥ ఉత్తమాటలు- అన్నీ అబద్ధాలు-

నా॥ విమలలోని అందాన్ని చూడలేని నిర్భాగ్యుడు నిన్ను మాత్రం యేం సంతోషపెట్టగలడు?

కా॥ విమల నాకన్నా బావుంటుందా?

నా॥ చూడ్డానికి బావుంటుంది. కాని నీ సంగతి వేరు.

కా॥ అంటే—

నా॥ నీ ఆకర్షణ వేరు- పానకానికీ, సారాయికీ వున్న భేధం-

కా॥ తెలీటంలేదు. సరిగా చెప్పు కవిత్వం మాని.

నా॥ అసలుమాట లవసరం లేకండానే రూఢిచేసి చెపుతాను. (వొస్తున్నాడు.)

కా॥ ఏంవొద్దులే అక్కడే ఆగు.

నా॥ నీ చూపులు నన్ను నిలవనీక కుడుతున్నాయి. పడిపోతున్నాను (మాటలుతో గుమ్మందగ్గిరికి వొచ్చాడు) నిజం చెప్పు, ఏంకావాలని అట్లా చీకట్లో వెతుకుతున్నావు నీ చూపులతో?

కా॥ (ఆలోచిస్తో) నాక్కావలిసిందంతా.

నా॥ అమ్మొ!

కా॥ ఏమిటి?

నా॥ చెప్పను.

కా॥ చెప్పాలి.

నా॥ చెప్పను.

కా॥ చెపుతావా, చెప్పవా? కొడతాను.

నా॥ చెపితే.

కా॥ ఏంలేదు.

నా॥ చెప్పను. కొట్టు.

కా॥ పో, దూరంగా, పో.

నా॥ చెప్పనా?

కా॥ చెప్పుమరి.

నా॥ చెపితే, ఏమిస్తావు?

కా॥ చూద్దాంలే, చెప్పు.

నా॥ ఏమంటే, చాలా అనుభవశాలివి.

కా॥ (కోపంగా) ఏం అనుభవం?

నా॥ రసికత్వం.

కా॥ (ఏడుస్తో) నన్ను పాడుమాటలన్నీ అంటున్నావు వొంటరి దాన్ని చేసి. (కోపంతో) పో, వెళ్ళు, దుర్మార్గుడా!

నా॥ నేను వెళ్ళను.

కా॥ ఆయన వొస్తారు.

నా॥ నాకు భయంలేదు.

కా॥ నాకు భయం.

నా॥ ఆ కారణమేనా?

కా॥ ఏది?

నా॥ పెళ్ళిచేసుకున్న కారణం.

కా॥ అంటే_

నా॥ డబ్బు.

కా॥ (కోపంతో) డబ్బుకి నన్నమ్ముకుంటాననుకున్నావా? అంటావా! నీమొహంమండా, వెధవా, పో, నాతో మాట్టాడకు.

నా॥ ఏడిశావు నోరుముయ్యి. నిజం మాట్టాడితే, అట్టానే అదిరి పడతారు, చిందుల గుర్రంలాగు. ఏమిటది?

కా॥ నాకేం నీతిలేదనుకున్నావా?

నా॥ అబ్బో, నీతి! స్కూళ్ళలో చదివిన పిల్లల నీతి నేనెరగనూ!

కా॥ ఆమాటకూడా అన్నావా? నన్ను, నన్ను, అన్నావా, (ఏడుస్తోంది) ఆడదాన్ని, వొంటరిదాన్ని చేసి— చిక్కిందికదా అని—

నా॥ చిక్కావా! (పట్టుకున్నాడు.) చిన్నపిట్టలాగు యెట్లా వొణుకుతున్నావో, గూళ్లలో దూరి, తోకలాడిస్తున్నట్టు—

(కామాక్షి లోపలికి జరిగి తలుపేశింది.)

అయ్యో, అయ్యో, చచ్చా!

(కామాక్షి తలుపు కొంచం తీసి చూసింది.)

కా॥ ఏమిటి?

నా॥ అమ్మా! నా వేలు తలుపు సందున నలిగింది— చూడు.

కా॥ పాపం! (వేలుపట్టుకుంది.)

నా॥ ఒక్క వేలు నలిగితేనే యింత కరుణ కలిగితే, నే నంతా నలిగిపోతున్నానే, జాలిరాదూ? ఏం వేషాలు?

(కావిలించుకున్నాడు. చప్పున వొదిలి నవ్వుతున్నాడు.)

కా॥ ఏమిటి?

(నారాయణ నవ్వుతున్నాడు)

ఎందుకు నవ్వుతావు?

(నారాయణ నవ్వుతున్నాడు.)

చెపుతావా, చెప్పవా? చెప్పు ముందు. చంపుతాను. చెప్పు.

నా॥ ఓహో, ఓహో! వేలు నలగనూ లేదు, ఏంలేదు.

కా॥ అది నాకూ తెలుసు. కాని యింకా యెందుకో నవ్వుతున్నావు. చెప్పు ముందు.

నా॥ (నవ్వుతో) ఏం లేదులే—

కా॥ ఇంక ఆ నవ్వు మానవూ !

నా॥ ఇంతదానివని తెలీదు.

కా॥ అదుగో మళ్ళీ. ఎంతదాన్ని ?

నా॥ నిజం వొప్పుకుంటావా ?

కా॥ నిజమైతే—

నా॥ చెప్పనా ? కోపంరాదు కద ! ఇంతవరకు ఎంతమంది మొగా ళ్ళని యెరుగుదువు ?

కా॥ నేనా, నేనా ? (ఏడుస్తోంది) నన్ను అంటావా ? పో. (తోసేసింది అతన్ని.)

నా॥ నిజమానా, కాదా ?

కా॥ పో, పో, వెధవా, పో.

నా॥ ఇంకెందుకు నేను వెళ్ళడం ? తెలిసిపోయిందిగా !

కా॥ ఏమిటి తెలిసింది ? ఎట్లా తెలిసింది ?

నా॥ ఏంలేదులే.

కా॥ చెపుతావా, తన్ననా ?

నా॥ చెపితే వొప్పుకుంటావా ?

కా॥ చెప్పులే ! చూద్దాం.

నా॥ నువ్వు......నీ రొమ్ము నాకు తగలగానే తెలిసింది. నీ చెంపలు నా బుజాని కానించే విధమే చెప్పింది. బలేదానివి. ఏంటక్కులు చేశావు ?

(నవ్వుతున్నాడు.)

కా॥ (భయంతో) ఏంతెలుస్తుంది నీమొహం ?

నా॥ అదికూడానా ?

కా॥ ఏది ?

నా॥ అదే!

కా॥ అంటే—

నా॥ ఓ, ఓ, బలేదానివి. ఎన్నెల్లు.

కా॥ పో, పో, వెధవా!

(కలియపడ్డది. చెయ్యికోరికి, తప్పించుకుని తలుపువేసుకుంది. లోపల నవ్వుతోంది. నారాయణ తలుపునెట్టి, కొట్టి, బతిమాలుతున్నాడు.)

నా॥ ఒకసారి తలుపుతీసి-చూడు— ఒకమాట వినిపో— ఇంక నిన్నేమీ అనను— అన్నీ అబద్ధాలు. నువ్వు యేమీ యెరగవు.

(ప్రతి మాటకీ కామాక్షి లోపల నవ్వుతోంది. నిరాశపడి, దిగులుపుట్టి, నారాయణం ఏడుస్తున్నాడు.)

నువ్వు కనపడకపోతే, యిక్కడే చచ్చిపోతాను. ఎందుకు యింత నిర్దయ!......ఎందుకు నన్ను చంపుతావిట్లా! నేనింక బిగ్గిరిగా యేడుస్తాను. ఎవరు రానీ, నాకు సిగ్గులేదు. భయం లేదు. తలుపు తెరుస్తావా, బద్దలుకొట్టనా?

(కామాక్షి తలుపు కొంచంగా తెరిచి చూస్తోంది.)

కా॥ వెళ్ళు, ఎవరన్నా చూస్తే అపరిదిష్ట. ఆయన వొస్తారు. ఎప్పుడన్నా,......ఇప్పుడుకాదు.

నా॥ (కాళ్లమీదపడి) నన్ను చంపకు— నేను బతకలేను— నేను వొంటరివాణ్ణి— నా కెవరూ దిక్కులేదు. నా కామాక్షి కాదూ? నా మనోహరి, నా కిన్నెరవి కాదూ.

(మాట్టాడుతో కామాక్షిని లోపలికి తీసుకెళ్ళి తలుపువేసుకున్నాడు.)

(మంగమ్మా, సుందరేశయ్యా వొచ్చారు.)

మం॥ యెక్కడ యీ కళంకం బైటికి వొస్తుందో, యెక్కడ నా మూలంగా యీ వంశానికి అపకీర్తి వొస్తుందో అని యెన్ని అబద్ధాలాడాను! యెంత వంచనకి లోబడ్డాను!

సుం॥ ఎంత అనలం తెచ్చిపెట్టాను!

మం॥ నువ్వు తెచ్చే దేముంది! విధి.

సుం॥ అంతకన్న నిగ్రహం వుండవలసింది నాకు. మొగవాణ్ణి తప్పించుకున్నాను. ఆడదాన్ని నిన్ను బైటపెట్టింది సృష్టి!

మం॥ గర్భం రాకుండా జరుపుకునే పద్ధతులు కనిపెట్టారుటగా?

సుం॥ అదికూడా తెలిసింది నీకు?

మం॥ పాడు ప్రపంచం! ఇంక అంత మాత్రము భయమూ వుండకపోతే, పాపం పెరిగిపోదూ?

సుం॥ కాని నీ విషయం ఆలోచించుకో. ఎంత పాపం తగ్గేది! ఎన్నేళ్ల నరకం తప్పేది నీకు!

మం॥ నా విషయంలో సరే! కాని లోకమంతా యిట్లా చేస్తే— ఇంక నీతీ, దుర్నీతీ— (ఆగి) అవును. నేనెవర్ని, లోకపు నీతి, దుర్నీతి శాసించడానికి!

సుం॥ ఇంక విరహంలేదు మనకి. మన స్నేహాలతకి జననం, భయంకరమైన జంఝానిలంలో అంతం యీ మధురమైన విశ్రాంతిలో!

మం॥ ఆ మొదటి స్నేహంవేరు, యీ చివరిది వేరు—

సుం॥ ఏం?

మం॥ నీకు తెలీదూ?

సుం॥ అంటే, ఎప్పుడు వొంటిరిగా కలుసుకుందామా అనే మహాజ్వరం, ఇంక యీ జన్మానికి రక్తం అనుభవించదు.

మం॥ కాని వొంటరిగా మునుపు గదిలో కలిసినప్పుడు మాత్రం, ఆ భయమూ, తొందరా—

సుం॥ స్వేచ్ఛగా ఎప్పుడు కలుసుకునే వీలు కలుగుతుందా అని తపనపడుతాము— ఆ స్వేచ్ఛ తీరా కలిగేప్పటికి, మధురమైన ఆ తపన మాయమౌతుంది— జీవితమంటే అంతే!

మం॥ అబ్బా! ఎంత భయ మేసేది!

సుం॥ ప్రతి కిటికీ తలుపు బిగించమనేదానివి. ఎండాకాలం వుక్క—

మం॥ మళ్ళీ యిదీ ఎండాకాలమే! వా ళ్లా గదిలో యెట్లావున్నారో గాని!

సుం॥ దీపం తగ్గించారు. కిటికీ తెరిచేవుంది.

మం॥ (గదివేపుచూస్తూ) అట్లాంటి స్వేచ్ఛను యెన్నడూ యెర గనుకదా! భయంతో నిండిన జతుకే ఐపోయింది ఆ నాలుగు దినాలూ!

సుం॥ కాని ఆభయంలోనే వుంది, మాధుర్యం- స్వేచ్ఛ త్వరలో తృప్తి నిస్తుంది.

మం॥ తృప్తి నెరిగన వా ళ్లం టా రా మాటలు ! జన్మమంతా వుత్త వూహాలోనే తప్ప—

సుం॥ వెంకటచలానికైనా ఆమొదటిభార్య సంగతి మనసులో గుచ్చుకుంటానే వుంటుందనుకుంటాను యీరాత్రి! నాకూ అంతే! ఎన్నియేళ్లు దాంతో కాపరంచేసినా, మళ్ళీ తొలకరి వొచ్చినప్పుడల్లా నువ్వే జ్ఞాపకం వొచ్చి బాధపెట్టేదానివి. నిన్ను మరచిపోయిన తరవాత కూడా ఏదో అర్థంకాని ఆనం దం ఆ వాన గాలిలోంచివొచ్చి, నా హృదయాన్ని కలత

పెట్టేది. కాని కామాక్షి మాత్రం యే చింతా లేకండా ఆనందంగా వుండి వుంటుంది.

మం॥ అవును. సంసారంలో మొదటి అమృతాన్ని రుచిచూస్తో వుంటుంది- ఏ కలతా లేని ఆనందాన్ని. తెల్లారిన దగ్గర్నించి యింకజన్మమంతా బాధ్యతలే! కాని యీ ఆరుగంటలూ, ఆ తలుపుకాపాడుతుంది, వాళ్ళని యీపుక్కకి- ఆవాళ రాత్రి- కిటికీతీస్తే గదిలోకి రోడ్డుమీది లాంతరు వెలుతురు పడుతుం దని భయం.

సుం॥ నీ చీరకొంగుతో నా చెమట తుడిచావు. ఆ ప్రేమని తలుచుకుంటే, యీనాడు మనసు ఎట్లానో అవుతుంది. జీవితానికంతా అందమైన కల—

మం॥ నిజంగానా?

సుం॥ నీతిగా, మర్యాదగా, నా భార్యతో గడిపిన యిర్వై ఐదు ఏళ్ల లోనూ, ఒక్క దివ్యమై మెరిసే క్షణం జ్ఞాపకంరాదు— కాని నీతో భయంలో, పాపంలో గడిపిన ఆ ఒక్కరాత్రి— నిజంగా పాపమేనా? పాపమైతే ఎందుకు నా హృదయం ఆనందంలో నృత్యం చేస్తుంది! ఆ పాపం, తిరిగి అట్లాంటి పాపం యెందుకు తటస్థించలేదా' అని యిట్లా వేదన యెం దుకు? మన రొమ్ముల మధ్య నలిగిన జాజిపువ్వుల వాసన జ్ఞాపకంలేదూ? ఏరోజు, ఎంత పనిలోవున్నా, ఏదో ఆలో చిస్తున్నా, ఆ జాజిపువ్వుల వాసన తగిలేప్పటికి, గుండె అతా త్తుగా పట్టినట్టు అయ్యేది— ఎందుకా అని—

మం॥ ఏంచేస్తున్నాను. ఇన్నేళ్లు నేను? ఎందుకు బతికాను? ఎందుకోసం? నీతికర్తలకి, తుచ్ఛప్రపంచానికే భయపడి,

దివ్యమైన ఆనందాన్ని పొందుతున్నాను. నా ఆస్తిని, నా మర్యాదని, చూసుకుని జీవితమంతా కష్టపడి బంగారాన్ని పోగుచేశాననుకున్నా, సత్యకాంతిమీద పడేప్పటికి, అంతా, అంతా, గడ్డి, మన్నుగా మారింది. మర్యాదా, నీతీ, అంతా కలిపి— మనం వేడి శ్వాసల్లో, చూపుల కలియికలో, దగ్గిరిగా చేర్చి పొత్తుకున్న చంపల స్పర్శలో, అనుభవించిన రెండు నిమషాలకి సాటివొస్తాయా! ఎందు కీ ప్రపంచం తమ ఆనందాన్ని వొదిలి, మర్యాదలూ, ధనమూ, ఆస్తీ, కీర్తీ, సంపాయించడానికి తంటాలు పడుతుందో నీ కర్థమాతుందా?

సుం॥ మనం పడలా?

మం॥ ఇట్లా పశ్చాత్తాపమన్నా వొస్తుందా?

సుం॥ మనకున్న మాత్రిము వివేకమూ లేదనుకుంటూ ప్రపంచానికి — ఏ రసికులకో తప్ప.

మం॥ ఏం చేశాను, యిన్నేళ్ళు? ఇతరులని సంస్కరించడంలో నా వెమికలు విరుచుకు సార్థకపడ్డదనుకున్నాను నాజీవితం. ఈ యిరవై యేళ్లూ ఒకరం యింకోర్ని చూసుకోడానికి భయపడి.—

(గదిలోపల్నించి నవ్వులు)

ఒక్కసారి జన్మానికల్లా, ఒక్కసారి అట్లా — వెళ్ళిచూస్తాను పోనీ, నా కన్నులు సార్థకమయ్యేట్లు —

సుం॥ వుందూ! వాళ్లతోనేమిటి? వాళ్లననుభవించనీ — మనం మాత్రం —

మం॥ ఇంకానా! ఇప్పుడా! ఎంత ప్రియత్నిస్తేమాత్రిం ఎండా కాలపుగాలికి ఆరాత్రివలె, రక్తం పొంగుతుందా, వొళ్లట్లా

నరనరం లాక్కుపోతుందా, ఇంక నాకళ్ళు అట్టా మెరవ
గలవా, ఆ పువ్వులవాసనతో తల మధురంగా తిరుగుతుందా
లాభంలేదు.

(విమల వెడుతోంది)

ఎవరది? అదే, విమల...ఎందుకో, చీకట్లో మళ్ళీ యింటి
వేపు వెడుతోంది. రండి మెల్లిగా వెనక్కి వెళ్లి చూద్దాం.

(వెడుతున్నారు.)

సుం॥ పాపం, దాన్ని చూస్తే నాకు దిగులుగానే వుంది. ఎదో
అదీ వయసులో వుందా —

మం॥ కాని అదిచేసిన దుర్నయమో! ఎన్నిసార్లు మందలించినా
యెదిరించి, బుద్ధిపూర్వకంగా — అందులో యిద్దరు పిల్లల్ని
ముందుపెట్టుకుని — కాని — (వూరుకుంది) యీవాళ
ప్రయాణం కట్టింది.

సుం॥ ఎక్కడికి?

మం॥ చెపుతా, ఇందాక భోజనమైన తరవాత, అరుగుమీద
కూచున్నప్పుడు, వెంకటచలం నాకోసం కేకవెయ్యలా!
విసుక్కుంటో వెళ్లానే...

(వెళ్లారు. వెంకటచలంవొచ్చి తలుపు కొట్టాడు)

వెం॥ కామా, కామా,

(పలక లేదు.)

అప్పుడే నిద్ర! దీనికి!

(బిగ్గిరిగా) వొచ్చాను. చూడు. కామాక్షీ! దీనికికోపం
వొచ్చినట్టుంది నే నాలిస్యంచేశానని! ఈ రెండు నిమషాలూ

కూడా నన్ను వొదిలివుండలేకపోతే యెట్లా చెప్పు! నువ్వేగా పంపింది!

(లోపల నవ్వు.)

ఏమిటీహాస్యం? తలుపు తీ. అబ్బా! ఎంతసేపు? ఇట్లా సగంరాత్రి గడిచిపోయింది యేదో ఓగోలతో! మాట్లా డవేం? అప్పుడే నిద్రా! ఆ, నిద్రపడుతుందా యేం? తమాషా! లేక నే నాలిస్యం చేశానని కోపమా? ఎంత జాణవి! తలుపు తీ.

(ఊరుకుని వింటున్నాడు)

అబ్బా! తీద్దూ, ఎంతసేపు యీ హాస్యం? ఈ ఆలిస్యాని కంతా నాలుగింతలు కసితీర్చుకోనా?

(లోపల నారాయణ నవ్వుతున్నాడు. వెంకటచలం ఆశ్చర్యపడుతున్నాడు)

ఆ దుష్టుడి నవ్వు యెప్పుడు నేర్చుకున్నావు? వాడి నవ్వు! ఎంత సరిగా, అట్లానే నవ్వావులే. గట్టిదానివి. నన్ను భయ పెట్టాలనే! నేనా భయపడేది!

(లోపిల్నించి నారాయణ "నడు నడు చలిమిడి ముద్దా" అన్నాడు)

వెం॥ అదుగో అదే వాడి కంఠమే! వాడి మాటలే! ఎంతతెలివి గలదానవో!

(లోపిల్నించి నారాయణ 'ఆడముండా నువ్వు నాకు మొగుడేమిటే అంట్లముండా, నీమొహానికో భార్యకూడానా' అన్నాడు)

వెం॥ (భయపడుతో) కామాక్షీ, ఒసే, ఒకసారి కిటికీదగ్గిర కన పడు పోనీ! కనపడవా! తలుపు బద్దలుకొడతాను.

(తంతున్నాడు. కిటికీదగ్గిరికి నారాయణ వొచ్చాడు.)

నా॥ నీ కామాక్షి నారాయణరూపం ధరించడంకూడా నేర్చుకుంది.

(వెంకటచలం మాట్లాడలేక పోయినాడు)

పో, నీ అవసరం లే దిక్కడ. మాట్లాడకండా వెళ్లు. పో, అమ్మతో, చెప్పుకో, యింకో పెళ్ళి చేస్తుంది.

వెం॥ నీ మృత్యువే నిన్నిక్కడికి తెచ్చిం దీ రాత్రి !

నా॥ నా పూర్వజ్ఞి నన్ను తెచ్చింది:

వెం॥ సరేలే !

(వెడుతున్నాడు. నారాయణ నవ్వుతున్నాడు. వెంకటచలం కొంచం దూరంవెళ్లి తిరిగి వొచ్చాడు.)

వెం॥ కామాక్షీ !

నా॥ ఎందుకది ?

వెం॥ ఒకసారి కనపడు.

నా॥ ఎందుకో ! ఒక్కసారిచూసుకుందామనా ! వెధవ దత్తి !

వెం॥ కామాక్షీ !

నా॥ రావటంలేదు. సిగ్గుపడుతోంది. జుట్టంతా బుజాలమీద పరుచుకుని తల దిళ్లల్లో పెట్టుకుని పడుకుంది. రావటంలేదు. పొద్దున్న చూపిస్తానులే !

వెం॥ కామక్షీ, వీడు నిన్నేం బలవంతం చెయ్యలేదుకద ! నువ్వే పిలిచావా ?

నా॥ చెప్పవే, పాపం !

(లోపలికివెళ్లి, కామాక్షిని బలవంతంగా లాక్కొచ్చాడు కిటికీదగ్గిరికి)

నేనా బలవంతంచేసింది, ఇందాకణ్ణించీ నన్ను చంపేస్తోవుంటే!

(కామాక్షి సిగ్గుతో తలవొంచుకుంది. వెంకటచలం వెడుతున్నాడు)

ఇంకో పెళ్లాన్ని తెచ్చుకో. అప్పుడే యిది పాతపడుతోంది.

(వెంకటచలం చెట్లనీడల్లో మాయమైనాడు. నారాయణా కామాక్షీ లోపలికి వెళ్ళారు.)

(కళ్లు నులుముకుంటున్న వసంతుని ఒక చేత్తో లాగుతో, ఇంకో చేత్తో బలువైన ట్రంకు పట్టుకుని విమల వొచ్చింది.)

వ॥ ఎక్కడికమ్మా? నిద్రవొస్తోంది. నేనిక నడవలేను.

వి॥ ఇంకకొంచం నడు — నాబాబువికదూ! అమ్మచూడు— ఎంత ట్రంకుమోస్తోందో! ఏడవకు.

వ॥ ఎక్కడికి? ఎక్కడికి—

వి॥ బిగ్గిరిగా మాట్లాడకు - రా, రెండడుగులు. నీకు మిఠాయి కొనిపెడతా, రా. రైలు, పొగొచ్చే నిజం రైలు కొని పెడతాను- (వసంతుడు కిందపడుతున్నాడు) ఒక్కసారి లే!

(విమల ట్రంకు కింద పెట్టి, అతిన్ని ఎత్తుకుని ట్రంకు ఎత్తుకోబోయింది ఎత్తలేకపోయింది. వసంతుని దింపి తనూ కూచుంది.)

నిన్ను వొదిలి బతకలేనురా, నాయినా, ఎట్లాపోను! ఎట్లావుండను. నువ్వు పిచ్చిమాటలు మాట్లాడుతోవుంటే వినకండా - నీ చిన్ని చేతులతో పుస్తకాలు పట్టుకు నడుస్తోవుంటే చూడకండా యెట్లా బతకను - నిన్నిక్కడకొడ్తతారు. అమ్మ చెడ్డదని నేర్పుతారు.

(వెంకటచలం వొచ్చాడు.)

వి॥ వొద్దు, వొద్దు, తీసుకుపోకండి. నా బిడ్డని లాక్కుపోకండి. నేను బతకలేను. మీకు తెలీదు, నాగర్భశోకం. తీసుకోకండి- మీపాదాలమీద పడుతున్నాను.

వెం॥ వుండు. మాట—

వి॥ చూడండి- మన ప్రేమ జ్ఞాపకంతెచ్చుకోండి. నీరదని కన్న ప్పుడు నాకు జబ్బుచెయ్యలా! నేను చచ్చిపోతానని నామీద చూపిన ప్రేమ జ్ఞాపకంలేదూ? ......ఇంకమీరు కనపడను- ఇంక జన్మలో యేమీ అడగను- ఇదొక్కటే- నా బిడ్డని నా నాయన్ని-

వెం॥ ఎందుకట్లా గోలపెడతావు? వుండు-

వి॥ ఆ, ఏమంటారు? ఏమిటి? లాక్కుపోకండి- పొయ్యేదాన్ని ఎందుకు వెనక్కి పిలిచారు. అబద్ధాలుచెప్పి - నా బాబుని చూసేటప్పటికి నాకు కాళ్లాడలేదు. అందుకని తీసుకు పోతున్నా. క్షమించండి- మీ కాళ్ళుపట్టుకుంటా - దిక్కు మాలిన పక్షిని- దరిద్రురాలిని- నాయనా!

వెం॥ ఎందుకు గోలపెడతావు? లాక్కెళ్లను.

వి॥ నిజమా? తీసికెళ్లరా? నిజమా? నన్ను చంపకండి - వేళా కోళం కాదుగద!

వెం॥ నిజమే, వెళ్లు. తొరగాపద- నాకు పనివుంది.

వి॥ అవును. మీ ఆనందభంగంచేశాను. క్షమించండి.

వెం॥ (కోపం అణచుకొంటూ) పద, మాట్లాడకు. తీసుకుపో తొరగా.

వి॥ ఏమిటి అట్లావున్నారు?

(విమల ట్రింకు తీసుకోబోయి)

అబ్బాయి బట్టలు- నాచేతకాదు- బలువు- (ఏడుస్తోంది)

వెం॥ పద (పెట్టె తీసుకున్నాడు)

వి॥ మీారే, మీారే- వొద్దులెండి- పెట్టి అసలు వొద్దులెండి- బట్టలు వుండవేమో, దరిద్రురాలిని. కుట్టించలేనేమోనని కాపీనపడ్డాను- వొద్దులెండి—

వెం॥ వొస్తాపద.

వి॥ పాపం, యీా మొదటిరాత్రి మీాకీ క్షోభ కల్పించానేమిటి! నిజం, వెళ్లండి— పాపం కామాక్షి ఏం గోలపెడుతోందో!

వెం॥ మాట్లాడకు, పద!

వి॥ వొద్దండీ. నేనువెడతాను - మీారు వెళ్లండి. రండి - నేను వొదుల్తాను మిమ్మన్ని- వొద్దు- పదండి.

(ట్రింకులాగి కిందపెట్టింది) ఇంక వెళ్లండి. నా దిగులు చూసి వెళ్లటంలేదుమీారు. నా కేమీా దిగులులేదు- నా అబ్బాయిని యిచ్చారు- నాకదేపదివేలు- చాలా సంతోషంతో వెడుతున్నాను. వెళ్లండి. పిలవనా, కామాక్షిని?

వెం॥ వొద్దు, ముందుపద నువ్వు.

వి॥ ఎందుకు కోపం?

వెం॥ కోపంలేదు. ఈ ట్రంకు వొద్దులే. వాడికి చొక్కాలు కుట్టించు. (చేతివుంగరం యిస్తున్నాడు) నాలుగు వందలు ఖరీదు అది. భద్రం, పద.

(వసంతు లేస్తున్నాడు.)

వి॥ నేను వెళ్లలేను. నా కాళ్ళు వొణుకుతున్నాయి- నేను వెళ్లను ఇక్కడే వుంటాను......కాదు......వెడతాను ... తెండి (వసంతుని)

(తీసుకోబోయింది వెంకటచలం విమలని కావిలించుకున్నాడు.)

వెం॥ వెళ్లకు నాతో వుండు.

వి॥ (యేడుస్తూ) యెన్ని సంవత్సరాలయింది.

వ॥ (లేచి) యెవరు? నాన్నా! అమ్మని కావిలించుకుంటున్నా వేమిటి?

(వెంకటచలం విమల్ని వొదిలి, వసంతుని యెత్తుకుని కావిలించుకున్నాడు)

వెం॥ వసంత్! నిన్నెన్నాళ్ళయింది యిట్లా యెత్తుకుని; నాబాబూ, నీకు రేపు యెన్నో బొమ్మలు కొనిస్తాను.

వ॥ నీరదకి వొద్దు, నాకు ఎలుగుబంటిని కొనిస్తావా?

వెం॥ అన్నీ కొనిస్తాను. యెప్పుడూ యెత్తుకుంటాను. నేను లేకండా, నేను ముద్దుచెయ్యకండా, యెంత యేడ్చావో.

వ॥ నే నేడవలేదు నాన్నా, వొదిలెయ్యి నన్ను— నిద్రవొస్తోంది.

(కిందదిగాడు.)

వెం॥ విమలా, వెళ్ళవుకదూ!

వి॥ వెళ్ళక—

వెం॥ వొద్దు. వుండు.

వి॥ యెంతకాలం వుంటుందీ బుద్ధి? తెల్లారి ముసిలావిడ మొహం చూడగానే—

వెం॥ కాదు. నేను వెళ్ళమనను— నేనూ నీతో వొస్తానో, లేక యింకెప్పటికీ నీకు కనపడనో— యేమీ తెలీదు.

(వెళ్ళారు. తలుపు తెరుచుకుని గుమ్మంలోకి నారాయణ వొచ్చాడు. వెనక తొరతొరగా కామాక్షి వొచ్చింది.)

కా॥ వెళ్ళకు.

నా॥ మీవాడు గోలచేసే వుద్దేశంతో వెళ్ళినట్టున్నాడు. చూస్తా పోయి.

కా॥ యేమన్నా కానీ, అంత నిందా నామీదే వేసుకుంటా, రా, వెళ్లకు, ఆ చేతులిట్టా తే—

(తన చుట్టూ పెట్టుకుంటోంది.)

ఇంకెట్లా వెడతావు? రా, లోపలికి, రా, ఈ సారి చెపుతారా, నీసంగతి— ఎట్టాంటివాడివి నువ్వు! నాకు వెర్రెత్తింది. నన్ను స్వర్గానికెత్తావు. జీవితంలో ఇంత మాధుర్యముంటుం దని తెలీదు నాకు, రా.

నా॥ ఇంకచాలు, వెళ్లనీ.

కా॥ (అడ్డంగా మెట్లమీదపడి) నామీదనించి నడు. నా రొమ్ము మీద పాదాలతో తొక్కుతోపో. వెడతావా? నన్ను చంపుకున్నట్టే! నాకు సిగ్గుపోయింది. నీ వెనక కేకలేస్తాను. ఏడుస్తాను. నీవెంట పడతాను— నీతో యెక్కడికన్నా సరే బైలుదేర్తాను- ఇందాకటిమల్లే- మళ్ళీ ఓసారి......ఒక్క నిముషంకూడా వుండలేను, నువ్వు వెడితే- చస్తాను. నువ్వెవరు? ఎవరు నువ్వు? రాక్షసివా? ఇట్లా వుడుకెత్తించే పిశాచివా? ఎవరన్నా కానీ, నా బతుకంతా నీకు దాస్యం చేస్తాను. వెళ్లకు.

నా॥ ఎవరో వొస్తున్నారు— వుండు.

కా॥ కానీ, అందరిముందూ, నీ మెడమీద వేళ్ళాడతా— నీ చేతుల్ని యిట్టా అదుముకుంటా— నాబాబు కదు- రా.

తా॥ నీ బాబే వొస్తున్నాడు.

కా॥ రానీ, అలిసిపోయినావు. మళ్ళీ ఫలహారాలు తిను. వూరికే పడుకో- నా తల నీపాదాలకానించి కూచోనీ.

నన్ను మాత్రం వొదిలివెళ్ళకు. వుమ్మెయ్యి- తన్ను- చంపు-
కోసెయ్యి, నన్నుమాత్రం వొదలకు.

నా॥ ఛప్. వొదులు. సిగ్గులేనిదానా !

కా॥ వొదలను.

నా॥ లే. అడ్డంలే. ఆడదానివా, కుక్కవా.

కా॥ కుక్కనే.

నా॥ కుక్కకి తన్ను.

(తన్నిపోతున్నాడు.)

ఎవరో వొస్తున్నారు. పద. లోపలికి పద.

(నారాయణ కామాక్షిని లోపనికి తీసుకువెళ్లాడు. మంగమ్మా, సుంద
రేశయ్యా వొచ్చారు.)

మం॥ ఇంక యేం చేద్దాం ?

సుం॥ ఈ రాత్రికి పడుకోడానికి బుద్ధి పుట్టడంలేదు. ఇంకా
తిరుగుదాం. ఎన్నేళ్లయింది నీ దగ్గిరిగా నుంచుని, నువ్వేనా !
ఇంకెవరన్నా పౌఢ, నామీాద దయదలిచి నన్నిట్లా పుల
కాంకురాల్లో ముంచుతోందా !

మం॥ అబ్బా, ఆమాట మాట్లాడకండి.

సుం॥ పోనీ, అన్నచెల్లెళ్ళవలె, నిర్మలంగా, శాంతంగా వెళ్లబుచ్చు
దాం జీవితాన్ని –

మం॥ అవును, యీా తోటలో, చెట్లనడుమ, పిట్టల్నీ, మబ్బుల్నీ
చూస్తూ -

సుం॥ కాని పొద్దస్తమానం యెట్లాతోస్తుందినాకు. క్లబ్బులేదు.
పేపరులేదు......కాని ఒకరో, యిద్దరో మనమలుకలిగితే
ఆడుకోవొచ్చు వాళ్లతో, వాళ్లకి కథలు చెప్పి -

మం॥ అవును. నీ కూతురుబిడ్డలు కనక నీకు ప్రేమ -

సు॥ నీ కొడుకు బిడ్డలుకారా?

మం॥ కాని నా రక్తమా?

సు॥ అవును కొడుకే ఐతే -

మం॥ ఏం చేస్తున్నారో! మళ్లీ నాటిమల్లే - యిద్దరూ, సంతోషంగా - చూద్దాం - యేం చేస్తున్నారో!

సు॥ ఛీ!

మం॥ కాదు. వొక్కసారి -

(వెళ్లి చూసింది కిటికీలోంచి ఆశ్చర్యంతో, భయంతో, నోటమాట రాక, వొచ్చి కూలబడ్డది.)

సు॥ ఏమిటె? ఏమిటె?

(వెళ్లిచూడమని సౌంజ్ఞచేసింది. అతనూ అట్లానే వొచ్చి పక్కన పడ్డాడు.)

మం॥ అవునా?

సు॥ అట్లానేవుంది.

మం॥ ఎట్లా?

సు॥ ఘోరం! ఘోరం!

మం॥ సరిగా చూశావా?

సు॥ సందేహంలేదు.

మం॥ ఏదన్నా మాయా?

సు॥ రాక్షసం.

మం॥ ఎట్లా వొచ్చాడు?

సు॥ వెంకటచలం యామైనాడు.

మం॥ మళ్లీ చూడు

సుం॥ అక్కర్లేదు

మం॥ ఏం చెద్దాం? అన్నా, చెల్లెలూ -

సుం॥ హర, హర !

మం॥ మన పాపమే!

సుం॥ మనదే, మనదే!

మం॥ నీదే!

సుం॥ నాదేలే! ఏం చెయ్యను? ఏం చెయ్యను? ఈపాడుకళ్లు -

మం॥ మనపిల్లలిద్దరూ - సంతోషించు - నాట్యమాడు - కడుపు నిండిందా?

సుం॥ హర హర! ఇప్పు డేమౌతుంది? పిడుగుపడి తగలపడరా వాళ్లు! దేవత లూరుకుంటారా?

మం॥ వాళ్లమీదకాదు - మనమీద - వాళ్లకేం తెలుసు?

సుం॥ వీల్లేదు, వీల్లేదు.

మం॥ ఏం చెయ్యవేం? వూరికే వీల్లేదు, వీల్లే దనక పోతే-

సుం॥ ఏంచెయ్యమంటావు?

మం॥ తిట్టుకునేవాళ్లు-

సుం॥ ఒకర్ని చూసి ఒకరు మండిపడేవాళ్లు-

మం॥ అంతా పేర్మిమేగావును!

సుం॥ ఒకటే గర్భం.

మం॥ ఐతేనే. మన ఆకర్షణే! మన దుర్మార్గమే. వాళ్ళిద్దరికీ వొచ్చింది. నన్నుచూసి నువ్వెట్లా నిలవలేకపోయినావో - అట్లానే నీ కూతురు నా కొడుకునుచూసి-

సుం॥ కాదు నీ కొడుకే-

మం॥ కాదు, కాదు. నీ కూతురే పిలిచివుంటుంది. వాడు చెడ్డ వాడైనా, ఆడదే—

సుం॥ మరి నువ్వా నన్ను కోరింది, నువ్వేనా?

మం॥ కాదు, కాదు- అబ్బా, ఆలోచించకు- మాట్లాడకు. వ్రార్థికే కూచున్నారేమో! అంతేనేమో!

సుం॥ భయమేస్తోంది, వుండమన్నదేమో!

మం॥ భయమేమిటి?

సుం॥ అతి భయం దానికి.

మం॥ శోభనంరోజు రాత్రి, యిదేం బుద్ధి!

సుం॥ వాడేమో!

మం॥ యిట్లా నీతిలేకండా ఎట్లా పెంచావంట!

సుం॥ మరి వాడు మాత్రం- ప్రతి ఆడదాన్నీ-

మం॥ నీ బుద్ధే! నువ్వు నన్నేంచేశావు? ఆ ఆకర్షణే, ఆ దుర్బుద్ధే! ఆ నీతిలేకపోవడమే! మన పాపమే నన్ను తరతరాల యిట్లా బాధిస్తోంది-

సుం॥ నీమీదంటే అట్లా మనసు కరిగిపోయిందిగాని నా బుద్ధి అట్లాంటిదేమీకాదు- ఆ నాటినించి ఎవరి వంకన్నా కన్నె త్తన్నా చూడలేదు.

మం॥ కాని లోకం అభివృద్ధిచెందటంలేదూ? తండ్రులకన్నా పిల్ల లీ విధంగా అతిక్రమిస్తున్నారు.

సుం॥ చూడు. యింకోసారి సరిగాచూడు.

మం॥ అవును తెలుస్తుంది. నువ్వూ రా.

(వెళ్ళిచూస్తున్నారు.)

సుం॥ ఇంక చాలు రా.

(మంగమ్మ కదలదు.)

మం॥ చాల్లే, ఇంక భరించలేను!

(సుందరేశయ్య కదలడు.)

సుం॥ అన్ని సందేహాలూ తీరాయి పద.

మం॥ కడుపు నిండింది.

సుం॥ జన్మం పావనమయింది. రా.

మం॥ చూడు, చూడు.

సుం॥ నీకుమల్లేనే.

మం॥ ఆ ముద్దు- అట్లానే!

సుం॥ రామ, రామ.

మం॥ ఏం చేద్దాం?

(ఒకరి దగ్గిరిగా ఒకరు జరిగారు. చేతులు పట్టుకున్నారు. దగ్గిరిగా ఆనుకు నుంచున్నారు.)

సుం॥ అబ్బా!

మం॥ ఎంత బావుంది— దగ్గిరికి రా.

(ఒకర్ని ఒకరు ఒత్తుకున్నారు. చప్పున మంగమ్మ పరిగెత్తుకు ఒచ్చి చెట్టుకింద పడ్డది. వెనక సుందరేశయ్య వొచ్చి ఆమెను లేవనెత్తాడు.)

సుం॥ ఏమిటిది?

మం॥ వుండు.

సుం॥ మాట్టాడు.

మం॥ ఉండు, తాకకు. ఇదేమిటిమ ల్లీ?

సుం॥ యేదోగాలి, భూతం-

మం॥ నువ్వే, మొదట—

సుం॥ నేనా, కాదు—

మం॥ నువ్వే!

సుం॥ చూశావా!

(మంగమ్మని కావిలించుకున్నాడు.)

ఇట్లానే!

మం॥ ఛీ, పో.

సుం॥ ఇంకా 'ఛీ' అంటావేమిటి?

మం॥ పో, నీమూలానే......మళ్ళీ యీనాడు—

సుం॥ అవును.

మం॥ మొదలా—

సుం॥ ఏంచేస్తాం?

మం॥ ఏంచెయ్యడమేముంది?

సుం॥ మనం కర్తలమా?

మం॥ మళ్ళీ, అదంతా—

సుం॥ నే నున్నానుగా!

మం॥ ఛీ, ఛీ, సిగ్గుచేటు, వొదులు.

సుం॥ కదలను.

మం॥ కనపడతాం? సిగ్గు. సిగ్గు- ఇన్నేళ్ళొచ్చి-

సుం॥ ఆ సిగ్గే కొంపముంచింది— ఆవాళ మెరుపులకింద—

మం॥ నువ్వు ఆ నారాయణకు మల్లేనే— నా మెడపట్టుకుని—

సుం॥ మరీ అంత ముసలివాళ్ళమూ! ఇప్పుడుమాత్రం? యింకో

రెండేళ్ళు— నాలుగేళ్లు— యీ కాలదేవత నించి తస్కరించలేమా !

మం॥ నిజమేలే— కాని, అక్కడ— ఆ సంగతి— వూరికే కూచుంటావేం ?

సుం॥ పోయి—

మం॥ తగలపెట్టు, చంపు— విడతియ్యి— విడతీసి అపతలపారెయ్యి- "అన్నా చెల్లెలూ" అని అరు—

సుం॥ నువ్వూ రా.

(ఇద్దరూ నడిచారు)

మం॥ నేను రాలేను.

సుం॥ ఏంచేద్దాం ?

మం॥ ముందు ఆలోచిద్దాం, రా.

(ఇద్దరూ కూచున్నారు.)

సుం॥ ఎన్నేళ్లు యెంత బాధపెట్టానో నిన్ను ! ఇప్పుడు తెలిసింది. మళ్ళీ మనని యీశ్వరుడు కలిపాడు. ఉన్న కాలమంతా, పాపపరిహారార్థంగా నీ సేవలో వినియోగిస్తాను.

మం॥ మళ్లీ మొదలా ? ఇరవై ఏళ్ల తరవాత మళ్లీ మొదలా ? కాని యేంలాభం ? ఇన్నాళ్లు ఒకర్ని వొకరు ద్వేషించి... వొద్దు....కాని యీ బాధేమిటి ? ఏమిటిది ? ఎన్నడో అనుభవించిన సుందర స్వప్నాలూ. ఈ జన్మవో, పూర్వజన్మవో, రాబోయే జన్మవో, బాధలూ, ఆనందాలూ, నాకళ్ల ముందు కనపడుతున్నాయి. నేను కనక వొదిలిన పిల్లలు, నేను పాలియ్యక యెండబెట్టుకున్న పిల్లలు, పిలుస్తున్నారు. కసితీర్చుకుంటున్నారు గావును. విధి కనికరించి వొదులు

తుందా మనని! ఈ నాలుగు వృద్ధ నిమషాలన్నా స్వేచ్ఛగా అనుభవించనిస్తుందా! రక్తాశ్రువులతో చెల్లించాలి, పాప ఋణాన్ని! వెళ్లండి. వెళ్లండి.

సుం॥ వెళ్ళనా, నిజమా!

మం॥ వెడితే నా కిక్కడ యేంతోస్తుంది? ఏంచెయ్యను? మళ్లీ నా కెక్కడ కనబడ్డావు? కాని నువ్వు వుంటే—యీ పాపం— యీ బాధ— సరే చూద్దాం- కాని వాళ్లిద్దరూ- యిప్పుడు-

సుం॥ ఇది సాగడానికి వీల్లేదు. పిలిచి చెప్పు.

మం॥ యేమని?

సుం॥ సంబంధం.

మం॥ చెప్పనా?

సుం॥ దాచడానికి వీల్లేదు, చెప్పెయ్యి - మన రక్తం, మన ప్రేమఫలం.

మం॥ చెప్పినా మానాడా?

సుం॥ ఇంకా మానడా?

మం॥ కాని మన సంబంధం కూడా చెప్పాలికద!

సుం॥ చెప్పాలి—

మం॥ చెపితే— చిక్కులున్నాయి— ఈ ఆస్తీ, యీ యిల్లు తన దంటాడు.

సుం॥ అవును మరి వాడిదేకదూ?

మం॥ మరి వెంకటచలం?

సుం॥ వాడికీ కొంతభాగం యిద్దాం —

మం॥ ఏమంటారో — తగూలూ, వ్యాజ్యాలూ —

సుం॥ నేను సద్దుతాగా —

మం॥ ఆ యిద్దరి తగూలూ ఎవరూ తీర్చలేరు.

సుం॥ వెంకటచలానికి ఉద్యోగ మిప్పించి, పంపించి —

మం॥ అవును —

సుం॥ నువ్వూ, నేనూ, మనకొడుకూ, నా కూతురూ —

మం॥ మరి వెంకటచలంతో వెళ్లదూ ?

సుం॥ అవును — అదోచిక్కు.

(వెళ్లారు. నారాయణ బైటికి వొచ్చాడు వెనక కామాక్షివొచ్చింది)

నా॥ వెళ్లారు —

కా॥ ఇంకేమైనాగాని, ప్రితిరాత్రి — యిట్లా —

నా॥ ప్రితి రాత్రినా ? మరి ఆ మొగుణ్ణి యేం చెయ్య తలుచుకున్నావు ?

కా॥ ఏమన్నాకానీ — నువ్వుకావాలి — నాకు మొగుడూ, అత్తా, తండ్రి, యెవరూ లేరు.

నా॥ కోపమన్నావే నన్నుచూస్తే -

కా॥ ఇంకా కోపమే! నిన్ను చంపాలి - నిన్నిట్టా పట్టుకుని -

(మాటలు వినపడుతున్నాయి.)

నా॥ యెవరో వొస్తున్నారు. నువ్వు లోపలికి పో.

కా॥ తెగించాను. నాకేం భయం ?

నా॥ కాదు. ముసలిది చెడ్డది.

కా॥ నిన్ను విడవను - ఒక్క నిముషంకూడా నిన్ను విడవను. ఏమైపోతావో, యేమో ! నిన్నేం చేస్తారో వీళ్లందరూ ? నాకభయం - నిన్ను దాచుకుంటాను. నిన్ను కాపాడుకుంటాను. ఇందాక ఆయన బెదిరించారుకూడాను! వెళ్లకు.

నా॥ (నవ్వి)ఆయనొకమనిషికూడాను! వొస్తున్నారు. వెళ్లుముందు.

(కామాక్షి వెళ్లింది. మంగమ్మా, సుందరేశయ్యా వొచ్చారు.)

సుం॥ నువ్వుచెప్పు. నేనువెడితేనే బావుంటుంది — రేపు వాళ్లని—

(వెళ్లాడు. మంగమ్మ నారాయణని చూసింది)

మం॥ నారాయణా! ఇందాకణ్ణించీ ఎక్కడవున్నావు?

నా॥ స్వర్గంలో.

మం॥ సరిగా మాట్లాడు. నాతో హాస్యమా?

నా॥ ఎక్కడాలేను. నిద్రపోతున్నాను.

మం॥ అబ్బా! అబద్ధాలు మానవుకద! ఆగదిలో నీ కేం పని?

నా॥ నా కేం పని?

మం॥ నాకు అంతా తెలుసు—ఏం?...మాట్లాడవా? ఇంక అట్లాంటి దుర్మార్గంవీల్లేదు (దయగా)ఎందుకు యిట్లాంటిపనులుచేస్తావు?

నా॥ పెళ్లికానివాణ్ణి. ఏం చెయ్యను మరి?

మం॥ (ఇంకా దయగా) నీకు పెళ్లిచేస్తాను.

నా॥ పెళ్లా న్నేం చేసుకోను?

మం॥ నాయనా, నీకు ఆ స్త్రీకూడా యిస్తాను.

నా॥ బావుంది. ఎప్పుడిస్తారు? కాని నాకు పెళ్లివొద్దు.

మం॥ యిప్పుడేగా కావాలన్నావు?

నా॥ వూరికే అన్నాను. అఖర్లేదు.

మం॥ ఆ స్త్రీయిస్తాను. పెళ్ళిచేస్తాను. కాని నువ్వు కామాక్షిజోలికి పోవొద్దు.

నా॥ కామాక్షి జోలికా? అదిమాత్రం న న్నడగ వొద్దు.

మం॥ ఏం?

నా॥ నన్ను కొయ్యి, చంపు. కామాక్షినిమాత్రం వొదలను.

మం॥ ఏమిటి! వొదలవూ! నీకు మతిపోయిందా, వొదలవూ!

నా॥ వొదలను. నేను వొదిలినా అది నన్ను వొదలదు. మమ్మల్ని ముక్కలుముక్కలుగా కోసినా, చెక్కలు చెక్కలుగా చెక్కినా ఒక ర్నొకరం వొదలము.

మం॥ ఒరే బాబూ! ఎందుకురా, నాయనా, నాగుండె నిట్లా కాల్చుకుతింటావు? చేసిన ఘోరాలు చాలవురా? చివరి కిదికూడా జరగాలీ! ఓరీ, నీ యిష్టం, లోకంలో యెవరినన్నా తెచ్చుకో, నేనేమీ అనను. ఆ విమలతో యేకు. నీయిష్టం. దీన్నొక్కదాన్నీ వొదులు. అదివొచ్చినా వొద్దను. ఇదేరా నే నడిగే వరం. ఇదొక్కటేరా.

నా॥ అదొక్కటే నా చాతకాదు.

మం॥ (తనలో) అదొక్కటే! అదొక్కటేనా నీ చాతకాంది! ఎంత విపరీతం! (పైకి) ఎందుకు వొదలవురా?

నా॥ ఎందుకా? ఎందుకా? అది ...... అదిసరిగా నావంటిది. అట్లాంటిది లోకంలో యింకో ఆడది లేదు. దాన్ని చూడగానే ప్రేమపుట్టింది నాకు. అది నాదాని లాగు, మేమిద్దరం ఒకటే జన్మమెత్తినట్టు, నా రక్తం దానిరక్తాన్ని పిలిచింది. నాస్వభావమే, నాగుణమే దాంది.

మం॥ ఇంకమాట్లాడకు వొద్దు, వొద్దు — వూరుకో. అవును: అవును. నీరక్తమే, నీస్వభావమే - అర్థంకావటంలేదురా, మూర్ఖుడా? ఎంతఘోరపాపంచేశావు, సాయింత్రంలోపల నీ గుడ్లు పేలిపోవా, నీ తల చెక్కలుకాదా! అది—

(వెంకటచలం కర్రితో పరిగెత్తుకుంటోవొచ్చాడు. కర్రతో నారాయణ తలమీద కొట్టబోయినాడు. మంగమ్మ అడ్డంవొచ్చింది గురికిప్పి తగలలేదు. మళ్లీ కర్రయెత్తికొట్టాడు. నారాయణ, వీపుమీద తగిలి కిందపడ్డాడు.)

వెం॥ నన్ను పెట్టినబాధలకి అనుభవించు.

(పరిగెత్తి వెళ్ళిపోయినాడు. మంగమ్మ అరుస్తోంది. అందరూ వొస్తున్నారు. సుందరేశయ్యా కామాక్షి వొచ్చారు)

సుం॥ ఏమిటిది?

మం॥ వెంకటచలం కొట్టాడు.

సుం॥ చూడు, దెబ్బతగిలిందా?

మం॥ తెలీటంలేదు. మీరు చూడండి.

(కామాక్షి యీలోపల అతన్ని కావిలించుకుని ఏడుస్తోంది)

సుం॥ ఛీ, ఛీ, లే!

(మాట్లాడదు. అంత ధ్యాసా నారాయణమీదే.)

లేస్తావా? లాగనా? నీకేం సిగ్గులా!

కా॥ నన్నుకోసి ముక్కలుముక్కలుచేసి లాగవలిసిందే యిక్కణ్ణించి —

సుం॥ వాడు చచ్చాడేమో చూణ్ణీ.

కా॥ చస్తే నేనూ చచ్చాను.

సుం॥ డాక్టరికన్నా కబురుపంపు, పో.

మం॥ లే. తోటవాణ్ణి పిలిచి చెప్పా.

(కామాక్షి ఏడుస్తో పరుగెత్తింది)

సుం॥ నీళ్లన్నా లేవే?

మం॥ ఇంటోకి తీసికెడదాం.

సుం॥ బతికివున్నట్టు లేదు.

(ఇద్దరూ పట్టి తీసికెడుతున్నారు. కామాక్షి వొచ్చింది)

కా॥ ఏరే?

(చూస్తోంది. వెంకటచలం వొచ్చాడు.)

వెం॥ చచ్చాడా, బతికాడా ?

కా॥ హంతకుడు- నిర్భాగ్యుడా ! ఎందుకురా, అట్లా కొట్టావు ?

వెం॥ నీకోసం. నువ్వు వాణ్ణి చంపింది. నేను కాదు.

కా॥ నేనా ! సరేలే. ఇంకా వున్నావేం, యిక్కడ ?

వెం॥ ఇంకెక్కడ వుంటాను ?

కా॥ వుండి-

వెం॥ చచ్చాడా వాడు ?

కా॥ ఏమో నాకు తెలీదు.

వెం॥ చావకపోతే చంపుతాను.

కా॥ ఎందుకు చంపుతావు ? తేరగా వున్నారు చంపడానికి ! పూరుకుంటారు !

వెం॥ అట్లా చూస్తావేం ? వాడెవడు నీకు ? ఎందుకు చంపుతానా ? నీకోసం ! నిన్నెప్పుడు తాకానో, అప్పుడే వొచ్చింది, ధైర్యం ! అహా, స్వర్గమంటారే అది యెక్కడవుందో తెలిసింది. స్త్రీ అంటే ఎంత తీవ్రశక్తో అర్థమయింది.

కా॥ నీకా ? నీకు నేను స్త్రీనా ? నానించి ధైర్యం వొచ్చిందా ? వొచ్చిన ధైర్యంచాలు. ఇంకా వొచ్చిందంటే లోకాలు మునిగిపోతాయి. పద.

వెం॥ నేనెక్కడికి వెడతాను, నిన్ను విడిచి !

కా॥ అర్థం కావటంలేదూ, నువ్వుచేసిన పని ? ఇప్పుడు రారా, పోలీసులు !

వెం॥ ఆ-

కా॥ అవును.

వెం॥ రానీ, వాడే చచ్చా డంటాను. ఎవరో చంపా రంటాను,

కా॥ వూరుకుంటారు! మా నాన్న లేరూ ? ఆమె వూరుకుంటుందా? వాడికోసం ఆమె యెవరినన్నా నాశనం చేస్తుంది. నువ్విక్కడే వుంటే ఆమే చంపుతుంది నిన్ను. ఆమె వూరుకుంటే— (ఆగింది)

వెం॥ నామీద చెపుతుందా, అమ్మ! చెప్పదు.

కా॥ గుడ్డివాడా, ఆమె ప్రాణమంతా నారాయణమీదనే! నిన్ను చూస్తే పరమద్వేష మామెకి. ఆ మాత్రం తెలుసుకోలేకపోయినావు!

వెం॥ ఆ-

కా॥ మరి వెళ్ళు- తొరగా. పో. నీకోసమే చెపుతున్నా.

వెం॥ నువ్వూ రా, పోదాం.

కా॥ నేనా! నేనెందుకు వొస్తాను? పో, యెవరికీ కనపడక, యే దేశమన్నా పోయి బతుకు. వెళ్ళు.

వెం॥ నువ్వు వొస్తే—

కా॥ ఏమైనాసరే నేను రాను. నువ్విక్కడ వున్నా నేను నీదాన్ని కాదు. వెళ్లు. ఎందుకు చిక్కులు తెచ్చుకుంటావు. నీ చావును నువ్వు తెచ్చుకుంటున్నావు.

వెం॥ నేను వెడితేమాత్రం నన్ను పట్టుకోరా?

కా॥ నువ్వు వెడితే ఎవరూ చెప్పరు. పారిపోతే అందరి దయా నీమీదే వుంటుంది.

వెం॥ అమ్మని పిలు. నామీద చెప్పకుండా చేస్తాను.

కా॥ మీ అమ్మ నీవేపు తిరిగినా, నేను చెప్పి తీరతాను పోలీసులతో. పో.

వెం॥ నువ్వూ!

కా॥ అవును, నేను. ఇప్పుడే వెళ్ళి పిలుచుకొస్తాను.

వెం॥ వెడతాను– వెడతాను. తల్లీ! ని పాదాలమీద పడతాను. ఆ పిల్ల లిద్దరూ తల్లిలేని పిల్లలు- వాళ్ళకోసమన్నా కనికరించు దేవతా!

కా॥ మరి వెడతావా ?

వెం॥ సీరదని తీసుకుని-

(వెంకటచలం వెడుతున్నాడు. చెట్టు చాటునుంచి నారాయణ వొచ్చి నవ్వుతున్నాడు.)

నా॥ బలే చేశావే! రా యిట్లా రా, చాలాసేపయింది. వెధవ గెడ్డలు వీపంతా గుచ్చుకున్నాయి.

కా॥ నువ్వూ బలే మోసగించావే!

నా॥ నువ్వెట్లా కనుక్కున్నావు ?

కా॥ మొదట భయపడ్డాను. కాని నన్ను వొదిలిపోవని తెలుసు నాకు.

నా॥ నరకానికి కూడా !

కా॥ స్వర్గానికి కూడా !





రసికత భా
డమే చలంపని. ప్ర
యీ యీపరిస్థితుల్లో యిలా స
నికీ, అసలు తత్వానికీ ప్రయాణం చె
కాని బంధింపబడకు, బంధించకు. (ప్రేమంటే
డంకాదు) ఉన్నతపథాలకుపో. బాధ్యతఅనేది ఉ
వంటి ప్రేమను ఉపాసించు అనే. నిలకడగా ఉండలేనివారిని (నిష్కా-ర
ణంగా) చలం అభిమానించడు. (ప్రపంచంలోఉన్న కుళ్లు, మేళ్లు ఏమిచేసినా ఎక్క-డికీ పోవు. చలం సిద్ధాంతం ఏదీ చెయలేదు. సలహాలుమాత్రంఇచ్చాడు, ఏ సిద్ధాంతానికీ సంఘం లొంగదని తెలిసి. అయితే- చలం అభిప్రాయాలు ఎంతవరకు విశ్వాస్యాలు, ఆచరణీయాలూ, అంటే వారివారి చిత్తవృత్తుల్ని బట్టి ఉంటుంది సమాధానం. చలంకథలు చదివి చెడినవాళ్లు లేరా అంటే— ఉన్నారు. కాని చలం ఇవిచదివి రెచ్చిపోకు; ఇన్ని కన్నీళ్లల్లోంచి నడిస్తేనే గాని సుఖం దక్క-దు సుమా అనే చూపిస్తాడు. ... ... ఈ కథలన్నింటిలోనూ చలం పనివాడితనం, మజాలూ ఉన్నవి. ఒకప్పుడు ఈయన రచనల్ని వెలివేసిన తెలుగుదేశంలోంచి, పత్రికటనకర్తలు మేమంటే మేము అని నేడు ము కుకు వస్తున్నారంటే, దేశంలోని ఈయన రచనలయందలి గౌరవం వెల్లడి తుంది.

(ఆంధ్ర)

